# కనకతార

గ్రంథకర్త:

చందాల కేశవదాసుగారు



ప్రకటనకర్తలు:

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు,

శ్రీ సత్యనారాయణ బుక్కు డిపో,

రాజమండ్రి



వెల రు. 1-4-0

ఓం

# కనకతారానాటకము.

ఇయ్యది

అష్టావధానియు. విద్వత్సేవాధురంధరుండు నగు

## చందాల కేశవదాసుచే

రచియింపఁబడి

శతావధాని

సంపన్ముడుంబ సింగరాచార్యులచే

పరిష్కృతమైనది.




ప్రకాశకులు.

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు,

శ్రీ సత్యనారాయణ బుక్కు డిపో,

రాజమండ్రి.

1944

 [వెల రూ 1-4-0

39465
2019

# హెచ్చరిక.

ఈ "కనకతార" అను నాటకముయొక్క శాశ్వత ప్రచురణహక్కు – స్టేజిహక్కు, సినీమాహక్కు వగైరా లన్నియు పూర్తిగా మాకు చెందియున్నవి. కాబట్టి మా లిఖితరూపకమైన అనుమతి పొందనివారు యీ నాటకమును ప్రదర్శింపకూడదు.

ఇందుకు వ్యతిరేకముగా వ్యవహరించువారిపై క్రమ ప్రకారముగా చర్య తీసుకొనబడును.



రాజమండ్రి
6–10–43

రాజమండ్రి
శ్రీ కొండపల్లి ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

# ఇందువచ్చు పాత్రలు



## పురుషులు.

సూత్రధారుఁడు

ఉదయసేనుఁడు (మహారాజు)

క్రూరసేనుఁడు - క్రూరుఁడు (ఉదయసేనుని తమ్ముఁడు)

ప్రతాపుఁడు (సేనాధిపతి)

ధీమంతుఁడు (మంత్రి)

సోమేశ్వరదీక్షితులు (కూటసాక్షి)

సువర్ణుఁడు, దేవబలుఁడు } న్యాయవాదులు

మతిమంతుఁడు (విజయసేనుని మంత్రి)

అనంతుఁడు, గ్రీష్ముఁడు } రాఁజట్టి పుత్రులు

వైద్యుఁడు

ఖుస్రూఖాన్

లోభగుప్తుఁడు (వైశ్యుఁడు)

సేవకుఁడు

కంచుకి

గిడ్డూఖాన్ (పహరా బంట్రోతు)

సులోచనుఁడు (సేవకాధిపుఁడు)

కనకసేనుఁడు, కనక్, కనకు, కనకము (ఉదయసేనుని కుమారుఁడు)

వీరపాలుఁడు, శూరపాలుఁడు } క్రూరుని సహచరులు

మల్లిగాఁడు
సల్లిగాఁడు
ఎల్లిగాఁడు
పుల్లిగాఁడు } (జాలరులు)
బూచిగాఁడు (దొంగమేటి)
విజయసేనుఁడు (ఉదయసేనుని మిత్రుఁడు)
భటుఁడు (విజయసేనుని కోటకావలివాఁడు)
ఋషులు (కొందఱు)
రాంజట్టి (ఒకశూరుఁడు)

స్త్రీలు.

నటి
కమలాదేవి (ఉదయసేనుని పట్టపురాణి)
కీరవాణి (కమల చెలికత్తె)
తార (ఉదయసేనుని కూఁతురు)
రత్నాబాయి
రాధాబాయి } (రాంజట్టి భార్యలు)
లచ్చి (మల్లిగాని భార్య)



ఓం

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంన—

అస్మద్గురుభ్యోనమః

# కనక్తారా నాటకము



నాంది

ఉ. శ్రీకరమైన రాజ్యము వి ♦ శేషసుఖంబుల ఘోరవృత్తిచేఁ
గైకొని క్రూరు లెంతటి వి ♦ కాకులఁ బెట్టినఁగాని ధర్మమే
మాకు జయంబ టంచు దయ ♦ మాలనిమాన్యులఁ బ్రోచునట్టి సు
శ్లోకుఁడు శ్రీవరుం డిడుత ♦ శోభనముల్ కృపమీకు నిచ్చలున్.

సూత్ర—(నాంద్యంతమునఁ బ్రవేశించి) ఆహా! నేఁడేమి నా సుకృత విశేషము? మహాజనభరితమై, కన్నులపండువుగఁ బ్రకాశించు నీ దివ్యసభను సేవించి యానందింప నోఁచుకొంటిఁగదా.

క. కవులుం గాయకులుం ద
త్త్వవిధిజ్ఞులు ద్విజులు నృపులు ♦ వైశ్యులు పాదో
ద్భవులు న్నిండిన యీసభ
నవురా! కను టెంత పుణ్య ♦ మని వచియింతున్.

సర్వజ్ఞు లగు నీసదస్యుల నే నేతెరంగున సంతసింపఁజేయ నేర్తునో తోఁపకున్నది. (యోచించి) తోఁపక చింతిల్లిన నేమిఫలము?

తే. భారవహుఁడనై నే నిప్డు ♦ బహువిధముల
యోచనలు సేయఁ గార్యమె ♦ ట్లొడ్డు కెక్కు?
ఱోటఁ దలనిడి రోఁకటి ♦ పోటులకును
జంకినన్ ఫల మేమి? యీ ♦ శంక లేమి?

ఇట్లు శంకించి వెనుకంజవేయుటకు వీలులేదుకదా? గుణగ్రహణ ధురీణులు లోపముల గణింపరనుట నాకును నమ్మకమే. (తెరవంక జూచి) ఏమి నటీ, వెల్లఁబోయి నిలిచియున్నావు? విలోకన తత్పరు లగు సదస్యులీ కాలహరణమున కోర్తురా?

నటి—(ప్రవేశించి) ఇదిగో వచ్చితిని. ఏమి సెలవు?

సూత్ర—శృంగారము ముగిసెనా?

నటి—సరే! శృంగారమువలెనే యున్నది.

సూత్ర—ఏమి! అట్లనుచున్నావు?

నటి—కొంచెము తాళుఁడు, నాకింకను భయము పోలేదు.

సూత్ర—అటులనెదవేమి! నేనుండఁగ నీ కేమిభయము?

నటి—ఈకాలమున నొకరియెడ దయఁదలచువా రుండుట యరుదుగదా?

సూత్ర—అంత దయాశూన్యుడనా?

నటి—ఎవరిపాట్లు వారివేగాక, యొకరినొకరు విచారించు కాలమాయిది!

సూత్ర—నీ కిప్పు డేమి మూడినది? యెందులకు భయపడుచున్నావు?

నటి—నాకిష్టమేగాని యొకరికీడుఁ దలపెట్టవలదా?

సూత్ర—ఒకరితో నీకేమియవసరము?

నటి—ఇఁక దయాశూన్యులనుట కేమి సందేహము?

సూత్ర—ముఖావప్రసంగముననే కాలము ముగియుచున్నది. సంగతి ఏదో త్వరగాఁ దెల్పరాదా?

నటి—ఇంకను దెల్పెడిదేమి! నేఁడు మనవీధిం జరిగిన సంగతిఁ దలఁచుకొనిన, నాగుండె లవియుచున్నవి.

సూత్ర—(ఆతురతతో) ఏమి జరిగినది?

నటి—ఇంతకుముందొక త్రాగుఁబోతు యొడలెఱుఁగని మత్తతచే మనవీధిం జనుచు నొకయింటఁజొచ్చి సుకుమారియగు యబల నోర్తుఁ జెఱఁబట్టి, నట్టివైపరీత్యమున కామె కళవళపడి కంపించుచు నెలుఁగెత్తి రోదన మొనర్ప నట్టిసమయమందా యమ బిడ్డలు వానిం జూచి భయంపడి తల్లిపైఁబడి గగ్గోలుగ నేడ్చుచు నడువుమని పరిపరి గతులఁ బల్లటిల్లుచుండ నా క్రూరాధముఁడా కుఱ్ఱల (భూమిపైఁబడ వైచి తలలు గోయుటకొఱ కాయుధము నాయత్తము జేసికొనునం తలో నా డింభకు లెటువారటు చెదరి పారిపోయిరి. ఇట్టి కల్లోలనిమ యముననే సమీపమున నున్న జలముల నాయబలయుఁ బడియె.

సూత్ర—(వేగిరపాటుతో) ఏమేమి! ప్రాణములు విడిచెనా!

నటి—ఎన్నియో కడగండ్లువడి ప్రాణావశిష్టయై తుద కేపుణ్యాత్ముని కృపచేతనో తనబిడ్డల మరలఁ గలసికొన్నదఁట.

సూత్ర—అఁట మాత్రమేకాని, నీవు చూడలేదా?

నటి—చూడ కేమి! సాంగముగఁ జూచినచోఁజచ్చియే యుందును. నేననసేమి, వీధివారలెల్లరుం దలుపులు మూసికొని ప్రాణములఱచేత నిడుకొని డాఁగియుండిరి.

సూత్ర—సరే! యిట్టి ఘోర మాపెభర్తచూచి యూరకున్నాఁడా?

నటి—బాగుగ నున్నది! భర్తయే యున్నచో నిటు లేల జరుగును?

సూత్ర—అనాథయా?

నటి—ఏకూ్రరుఁడో యనాథగా నొనరించినాఁడు.

సూత్ర—ఆదుష్టుఁడు దండితుఁడు కాలేదా?

నటి—ఏదియెటులగునో కాని యిప్పటికి గ్రామమునుండి పలాయితుఁడయ్యె.

సూత్ర—సరే! ఇఁక నీ ప్రసంగ మాపుము.

నటి—నన్నేల పిలిచినారు?

సూత్ర—ఈసభాసదుల సంతసింపఁజేయుట కే మార్గము దోఁపక నిన్నుఁబిలిచితి.

నటి—మీచిత్తము ననుసరించి మెలఁగుటకు సిద్ధముగ నున్నాను.

సూత్ర—ఇపు డొక సహాయ మొనర్పవలయు.

నటి—ఏ విషయమున?

సూత్ర—ఏదేనొక నాటకమున.

నటి—ఏ నాటకమున?

సూత్ర—ఏమియుఁదోఁచుటలేదు. నీకేమైనఁదోచినఁజెప్పుము.

నటి—సరే! బాగుగా నేయున్నది. అప్పటినుంచి యొకనాటకమువలెనే చూచి వచ్చినాను. దానిప్రభావ మింతవరకు నామనంబునే యోచనకుఁ బోసియున్నది.

సూత్ర—ఆహా! ఆఁడువా రెంతభీరువులు. (స్మృతి నభిన యించి) బలే బలే! ఇప్పు డొకటి జ్ఞప్తికి వచ్చినది. దానిచేసినసదస్యుల నాటంకముగ సంతసింపఁజేయ నేర్తునని ధైర్యము వచ్చినది.

నటి—ఏనాటకము?

సూత్ర—నీవిపుడు చూచివచ్చిన నాటకమును బోలినదే.

నటి—పేరు లేదా?

సూత్ర—లేకేమి! యిటు వినుము—

సీ. నైజాముదేశము ♦ నం గల నెల్లుట్ల
పురవరవాసుండు ♦ పుణ్యమూర్తి
సద్ధర్మవర్తనా ♦ సక్తనిశ్చలచిత్తుఁ
డమితయశుండు జ ♦ యాధికుండు
ద్వివిధసద్విద్యాప్ర ♦ వీణుండు న్యాయవా
దులసమూహమున ని ♦ స్తులుఁడు ఘనుఁడు
దానసత్యదయాది ♦ దానుం డహంభావ
రహితుండు ధైర్యవి ♦ రాజమానుఁ

తే. గీ. డైన రామసింహప్రభు ♦ నభిమతమున
వ్రాసెఁ జందాల కేశవ ♦ దాసుఁ డఖిల
సుజనమోదప్రదంబు భా ♦ సురపదం బ
నఁగఁగలదు కనకతారాఖ్య ♦ నాటకంబు.

నటి—ఆనాటక మీసదస్యుల సంతసింపఁ జేయుననుట నిస్సందేహమే కాని రచనాచాతుర్యముంగూర్చియే నాకు గొప్పసందేహము.

సూత్ర—రాజహంసోపమానులగు నీసదస్యులు లోపంబు లెన్నుదురనుకొంటివా! అటు లెన్నఁడుఁ దలంపకుము కాని యీ రసికవరుల హృదయరంజనమునకుఁ బ్రథమమున నేదే నొకఋతువుం గూర్చి గానము సేయుము.

నటి—ఏ ఋతువును?

సూత్ర—ఏ ఋతు వేల? యీ వసంతమునే.

నటి—చిత్తము.

సీ. నవపత్త్రిపుష్పకా ♦ ననసంతతులలోన
విహరింప హాయిగ ♦ వెడలువారు

శుకపికశారికా ♦ నికరమ్ముల మృదుధ్వ
నుల విని చిత్తంబు ♦ లలరువారు
కర్పూరగంధపం ♦ కమ్ము మేన నలంది
చల్లగాలికి సంత ♦ సిల్లువారు
పూర్ణచంద్రికలోనఁ ♦ బూసెజ్జలఁ బరుండి
యవిరళానందమ్ము ♦ నందువారు

తే. గీ. ఎందఱెందఱో యింక నె ♦ న్నెన్నొగతుల
సంతసింతురు కాని వ ♦ సంతమునను
విరహిణీజనములు తుంట ♦ విల్తునిఁ గని
క్రూరుఁడవని మృతుం గన ♦ దూరుచుంద్రు.

[తెరలో] తే. గీ. ఎవఁడురా నను దూరువాఁ ♦ డీజగమున
మద్భుజాసార మెఱుఁగని ♦ మందు డెవ్వఁ
డేఁడి చూపు మిాక్షణమె ఖం ♦ డింతు వాని
నరటికంబంబునుం దెగ ♦ నఱికినట్లు.

నటి—ఆర్యపుత్రా! రక్షింపుము రక్షింపుము (భయమున పైఁబడును)

సూత్ర—భీతి నొందకుము. ఉభయసేనభూపతి తమ్ముఁడగు క్రూరసేనుఁ డిపుడు నీఋతువర్ణనమునందలి యర్థమును దనపై నిడికొని క్రోధావేశపరవశుఁడై యిటులే వచ్చుచున్నాఁడు. మనమిట నుండఁదగదు. పోదము రమ్ము (నిష్క్రమింతురు)

క్రూర—(క్రోధావేశుఁడై ప్రవేశించి)

తే. గీ. ఎవఁడురా (అను వెనుకటి పద్యముఁ జదివి)

ఇప్పు డిచటఁ గ్రూరునిఁ జావదూరుచుండు రని కూసినవాఁ డెవఁడురా? ప్రతిమనుజుఁడును క్రూరసేనమహారా జను నా నిజ నామధేయమునువిడిచిక్రూరుఁడుక్రూరుఁడనిప్రేలుచు, నాకిదియొకనీచ నామమును గల్పించినారు. వాఁ డిపు డెచట నుండెనో చూచెదఁ గాక (నలుదిక్కులు వెదకి) ఒకఁడైనను లేఁడే! ఎవఁడో నన్నెఱుఁగక ప్రేలి పాఱిపోయినాఁడు. వీఁడేమిలెక్క! నా పరాక్రమునకు లోకమునఁ బాఱిపోనిశూరుఁడెవ్వండు? అయిననాకిపుడేమికర్తవ్యము? (యోచించి) అగ్రజుని సభ కేఁగుటయే కర్తవ్యము (నిష్క్రమించును)



శ్రీ

# కనకతారానాటకము

## ప్రథమాంకము

ప్రథమరంగము—సభా భవనము.

[ఉదయసేనుఁడు, ధీమంతుఁడు, ప్రతాపుఁడు ప్రవేశింతురు]

ఉద—మంత్రివరా! ఈపరితాపము నా కెన్నఁడు తీరునో గదా?

చ. ధర తగినంత యున్నయది ♦ తక్కువలేవు రథంబు లశ్వముల్
కరులుఁ, గొలంత యుండదు సు♦ఖంబుల సంతతియున్ లభించె, నే
కరణిఁ గన న్మనంబునకుఁ ♦ గల్గదు ఖేదము కాని నాదు సో
దరుఁడగు క్రూరసేనుని కృ ♦ తఘ్నత నా న్మదిఁ గుందుచుండెడిన్!

ధీమం—మహాప్రభూ! నాకు నదియే విచారము మనంబును వ్యథఁ బెట్టుచున్నది. ఎన్నెన్ని సమయంబుల నెన్నెన్ని భంగులనో దుర్గుణంబుల విడుండని చెప్పి తుద కిపు డా యువరాజుగారికి నేశత్రురూపమునఁ గాన్పించుచుంటి.

ఉద—ఔను. కాన్పించుట కేమిసందేహము?

తే. గీ. తనమదిని సద్గుణుఁడు పరి ♦ తాప మంది
క్రూరునకు నీతిఁ గఱప వి ♦ రోధి యగును
భూతదయచేతఁ దేలు ని ♦ ప్పులను బడఁగ
వెలికిఁ దీసిన మీఁటక ♦ విడువఁ గలదె.

క్రూర—(ప్రవేశించి దూరముగఁ దనలో) అసమర్థుఁడగు మాయన్న తెలివిమాలిన మంత్రితో నేమేమోవిచారించుచున్నవాఁడు. ఈ స్తంభముచాటుననుండి యది యేమో కనిపెట్టెద (డాఁగును)

ఉద—నిన్ను శత్రునిగఁజూచు టట్లుండనిమ్ము. దుర్గుణులకు నీతిబోధ పరమానహ్యాకరముగఁ దోఁచు; నొకవేళఁ దప్పక వినవలసి వచ్చినను దాను వినిన దంతయు మసిలోఁగల్పిన చిత్రపురంగులవలె నిరర్థక మగును. ఏలయన?

తే. గీ. నీతిఁ దెల్పఁ గుమతి విన ♦ నే వినండు
వినినచో మార్చుకొను దన ♦ కనుగుణముగఁ
బంచదారయుఁ బాల్పోసి ♦ పెంచుచున్న
వేము మార్చుకొనకయున్న ♦ విషముపగిది.

క్రూర—(తిరస్కారముగఁ దనలో) ఓహో! ఇదియేనా విచారించుట? ఎప్పుడు చూచిన నీతియఁట, ధర్మమఁట, పెద్దలట, యిట్టి నిరర్థక విషయములచేతనే కాలముఁ గడుపుచుండును. పురుషుఁడై భూమిఁబుట్టినందుల కొకరిని వంచించి యేవిధముననైన వారల ధనదారామల గ్రహించి సుఖించుటే పురుషార్థము. కాని, లేకున్న బురుషు లవఁబరఁగుదురా? నే నొనర్చెడు పనులన్నియు దుశ్చర్యలని తలఁతురు. ఇట్టి కార్యము లీ చేఁతగానివారి కెట్లు సాధ్యము లగును!

సీ. పరభామలనుబట్టి ♦ బల్మిఁ బైకొనుటట్టి
పనియందఱకు సుల ♦ భమగునొక్కొ
ధనము నార్జింప నే ♦ పనికి వెన్దీయని
పనియందఱకు సుల ♦ భ మగునొక్కొ
సమయంబు వడిన మ ♦ స్తకములఁ ద్రుంచెడు
పని యందఱకు సుల ♦ భ మగునొక్కొ
అఖిలజనంబుల ♦ కరివలె వర్తించు
పని యందఱకు సుల ♦ భమగునొక్కొ

తే. గీ. చేతగానివారలు తామె ♦ శ్రేష్ఠుల మని
తలఁచి నాబోటిశూరుల ♦ ఖలు లటంచు
దూరుచుందురు దాక్షిణ్యు ♦ త్తులను నక్క
యెగిరి తినలేక వాన క ♦ పించినట్లు.

వీర లిపుడు ప్రసంగించుకొను కొంఱగానిపలుకుల వినుచున్న నా కేమిలాభము? నే నిపు డచటికేఁగిన నా యసమర్థుఁడేమో ధర్మ మార్గములని శిరోబాధ జనించునట్లు వాఁగుటకుఁ బ్రారంభించును. కావున నే నీక నిటనుండి యేఁగుటయే కర్తవ్యము. (అనిపరిక్రమించి, యోచించి) ఐన నింకేమి యనుకొనియెదరో వినియే పోయెదఁగాక.

పరి—మహారాజా! నాయట్టిధీరుఁడు మీదండనుండ నింత దండిచింతలో నేలమునింగెదరు? తగువెర వాలోచించి తెల్పిన నట్లొనర్చుటకు నేను సిద్ధముగ నున్నాఁడ.

ఉద—నే ననేకభంగుల నయవినయములతో నెంతబతిమాలి నను నా సోదరుండు వినఁడు. ఏమిసేయుదు?

కూర—(కోపముతోఁదనలో) ఏమిరా! ఇపుడునావిషయమే నటరా? మూఢాత్మా! నీ వెప్పుడు నామీఁద తలపోఁతయేకా! మంచిది.

ఉద—అమాత్యవరా! క్రూరసేనుఁ డొనర్చు దుశ్చేష్టలకు బిడ్డలయట్లు వర్తించుచున్న లోకుల కెందఱెందఱికెన్నెన్నియాపదలు గలుగుచున్నవి? అయ్యో!

కం. నీగుణమును విడుమని నా
నాగతులం జెప్పితిని వి॰ నడు నా పల్కుల్
బాగొనరుప నోగయ్యెను
రోగికిఁ బథ్యాన్న మిడిన ♦ రుచియింపనటుల్.

ఇందుల కేమిసేయుదు?

కూర—(తనలో) ఏమి సేయుదువురా! నీవు నన్నేమిసేయఁలవు? నిన్ననేకసారు లేమియో సేయనెంచితిఁ గాని యేకగర్భజుల మగుటచే విడిచితి.

ధీమం—చేయునదేమికలదు? ఇదివఱ కెన్నియుపాయములు చేసి చూచినారముకాము? అవి యన్నియు బూడిదలో వేసిన యాహుతివలె నిరర్థకములు కాలేదా? ఇన్నియేల? మీయనుజుని మనమును మరల్ప యుక్తి వెదకుట దుష్కరము. ఏలయన?

తే. గీ. విడువరాని సంసారంబు♦ విడువవచ్చు
నందగారాని కైవల్య ♦ మందవచ్చు

ధీమం—లోభగుప్తా! ధైర్య మవలంబింపుము.

ప్రతా—మే మందఱ మిచట నుండియుండ నీ కేమిభయము? నిర్భయముగా వచింపుము.

లోభ—అట్లరుదెంచి యుక్తవయస్సుచే మాయింట బదిలముగఁ గాపాడఁబడుచున్న నాకూఁతుం బట్టి చెఱుపనుంకింప, మత్పుత్రిక భయభ్రాంతయై, యెలుఁగెత్తి రోదన మొనర్ప—

ఉద—(చెవులు మూసికొని) హరి! హరీ! ఎంతఘోర మెంత ఘోరము! పాపము శాంతించుఁగాక!

ధీమం—శివశివా! ఇట్టిదురాత్ము నేమిచేసినఁ బాప మున్నదా!

క్రూర—(తనలో) ఆఁ! ఆఁ!

శా. ఏమేమీ! భయ మింత లేక నను నీ ♦ విట్లాడి తౌరార క్షుం
డా! మూర్ఖా! పొగరెక్కె నేమొ నను ♦ గ్రుడ్లం దీతునా లేక యు
ద్దామంబైన కరాసిచేఁ దునిమి చిం ♦ దవ్వాలుకన్ద్రెంతునా
యేనం చీక్రియఁ బ్రేలజొచ్చితివి రో ♦ రీ! హీనుఁడా! దుర్మతీ!

సిగ్గులేనిపందా! ఏమంటివి? నీవు నన్నేమి చేసెదవురా? నన్ను శిక్షించునంతటి సమర్థత కలవాఁడవా నీవు? నిన్నీదివసముననే జముని మందిరమున కనుపకున్న నేఁ గ్రూరసేనుండనఁటరా!

ప్రతా—మహారాజామాత్యుల యాజ్ఞ నెఱవేర్చుట కేను సిద్ధముగా నున్నాఁడ.

క్రూర—(తనలో) ఔరా! నీ కింతటి మగఁటిమ వచ్చినదిరా? యిష్టానుసారముగ నమాత్యుఁ డొంటిగ నేఁగకుండ వానికిఁ దోడేఁగుటకు నీవుకూడ సిద్ధముగ నుండకతప్పదు.

ఉద—(తనలో) దుష్టచరిత్రా! నీమొగముఁ జూడరాదు. నీవు నాసోదరుండ వగుటకేను పూర్వమం దేమిపాప మొనర్చితినో. (ప్రకాశముగ) లోభగుప్తా! తరువాత.

క్రూర—(తనలో) తరువాతనా? నీవుగూడ నీ మంత్రిసేనానాయకుల వెంబడినే యముని యాస్థానంబున కేఁగుటకుఁ బ్రయాణమై యుండుము.

లోభ—ప్రభూ! తరువాత నాసుతరోదనము నేను మొదలగు

నాబంధుగులందరు విని పోయి విడువిడుండని యెన్ని చెప్పిన విడువ కున్న మే మందఱ మెట్టకేలకు ధైర్యముఁ దెచ్చుకొని నాకూఁతును విడిపించితిమి.

ఉద.—అకటకటా! ఎంతకష్ట మెంతకష్టము!

ప్రతా—ఇట్లే చూచుచున్న నింకను మఱింతకష్టము.

ధీమం—ఎంతక్రూరకృత్యము జరిగినది! తరువాతఁ దరువాత?

లోభ—అటుల విడిపించిన మమ్ముఁ గాంచి, గాదఁగొన్న పులివలెఁ బటబటమని పండ్లుగీటుచు, తోకద్రొక్కిన త్రాచువలె రక్త నయనుఁడగుచు, యాఁకలిగొన్న సింగమువలె నార్భటించుచు గటము లదర, బొమలు ముడిపెట్టి కాలాంతకుండో యన నొక దండంబుఁ గేల నందుకొని, లేళ్ళగుంపులోఁ బడినసింగంబుభంగి మమ్మందఱ మోదినాఁడు.

కూర—(తనలో) సెబాస్! లోభగుప్తా! వైశ్యుడవైనను, మత్ప్రతాపమును సంక్షేపరూపంబున సరసముగా వర్ణించినావు.

లోభ—అట్టి దండఘాతములకుఁ గొందఱు చచ్చిరి. మరికొం దఱువిచ్చి దిశలఁ బాఱిరి. కొందఱు వికలాంగులై భూమిపైఁ బడి విల విలఁ దన్నుకొనుచుండిరి. ప్రభూ! మాయవస్థఁ జూచినఁ దెలియుఁ గాని చెప్పినఁ దీరదు. (దుఃఖించును)

ఉద—ఇఁక నీకూరకృత్యము వినఁజాల. నిన్నాదుర్మార్గుఁ డిచటి కెట్లు రానిచ్చెను?

లోభ—భయపడి మూలఁడాగిన మా వారిని వినరానిదుర్భా షలాడి ధైర్యవంతులగునట్లు ప్రోత్సాహపఱచి నేనొక మఱుఁగునడాగి గడగడ వడఁకుచు నాచర్యఁ గనిపెట్టితి; నిపుడిపుడే యా కూరసే నులవారు మార్గముఁబట్టిరి. దేవరవారికి మనవిఁ జేయుటకై పరువిడి వచ్చితి మ మ్మెట్లు కాపాడెదరో యెఱుఁగ జాలకున్నాను.

ఉద—అయ్యయ్యో!

సీ. కులసతులను జెఱఁ ♦ గొనుటకు నేమాత్ర
    మును జంకఁ డింక నే ♦ మనగవలయు?

శిశుపశుబ్రాహ్మణ ♦ స్త్రీహత్య లొనరింప
　　మనమునఁ గొంకఁడే ♦ మనగవలయు ?
ధనికులఁ గాని పే ♦ దలఁగాని ద్రవ్యంబు
　　హరియింపకుండఁడే ♦ మనగవలయు ?
మధుమాంసము ల్దిన ♦ మానియుండం డొక్క-
　　యరగడెమైన నే ♦ మనగవలయు ?
తే. గీ. ఎట్టి దుష్కృతకార్యంబు ♦ లేనిఁజేయ
　నంతరంగంబుఁ ద్రిప్పఁడే ♦ మనగవలయు ?
　దెలిసె భ్రిష్టస్య కావాగ ♦ తి యనునీతి
　యవనిలోన నమోఘ మం ♦ చనఁగవలయు.

ధీమం——నిండ మునిఁగినఁ జలియుండ దనునటు సదా కర్మాచరణుఁ డగువాని కేమిభయము ?

ప్రతా——సందేహ మేమి ! ప్రభు విట్లుపేక్షించుచున్న లెట్లు సుఖముగ నుండఁగలరు ?

క్రూర——(తల యూచుచుఁ దనలో) మంచిది మంచిది——
తే గీ. అనుఁడి మిమ్ముల నిప్పు డే ♦ మనను పిదప
　మత్కరస్థితఖడ్గమే ♦ మంకు మీకు
　మారికి న్బలికాఁబోవు ♦ మహిమ మెగిరి
　నంత నద్దాని దండింతు ♦ రా జగమున?

ఉద——అమాత్యచమూపతులారా!

ఉ. ఎంతని చెప్పవాఁడ నిఁక ♦ నెంతని శాంతి వహించువాఁడ ని
　ట్లెంతటికైనఁ జూచుచు మ ♦ తేమి యొనర్పకయున్న రేపు నా
　గొంతును గోయఁడే తలఁప ♦ గూడ దనుగ్రహ మింటిదీపమం
　చెంతయు ముద్దుగొన్న దహి♦యింపకయుండు నెయూతిమీనముల్.

క్రూర——(తనలో) నిజము వచించితివి. కాని తేపనుకొనెద వేల? నేఁడే యనుకొనుము.

ధీమం——దేవరవారికిఁ దెలియనివిషయ మేమిగలదు? త్వర పడి కర్తవ్య మాలోచింపుఁడు.

ప్రతా—ఆలోచించినచో నిక్లేల యగును ?

క్రూర—(తనలో) వేతాలోచన మెందుకు ? ప్రథమమున మి మ్మొంటరిగఁ గనుఁగొనుటయే నా కాలోచనము.

ఉద—నే నేమాలోచించుటకుఁ దోఁపదు. భూపతులకు మన స్స్వరూపులుగదా మంత్రులు. కావున,

క. ఆలోచింపుఁడు వానికిఁ
గోలోచితశిక్ష నెంత ♦ కఠినపు దీయం
బోలునో ? నీళ్ళను ముంచినఁ
బాలను ముంచినను మీాదె ♦ భారము నుండీ.

క్రూర—(తనలో) అసమర్థుఁడవని మొదటనే నుడివితి గదా?

ధీమం—అటులైన నో మహారాజా !

శా. క్రూరత్వంబున నిట్టికట్టిడిపను ♦ ల్గ్రాంకేమియు న్లేక తా
ధారాళంబుగఁ జేయువాఁ డగుటచే ♦ దండ్యుం డగున్ గావున
న్గారా మెంచక బద్ధుఁ జేయుఁ డిభను ♦ ల్గర్వోద్ధతి న్మీరిపో
నీరీతి న్మద మెల్ల డించెదరు కా ♦ దే మావటీ లిమ్మహిన్.

ప్రతా—ఇందులకైన సమ్మతింపుఁడు.

క్రూర—(తనలో) ఓరోరీ మనుష్యపశువులారా! నేఁడే మిమ్మ కాలుని గృహమున కంపఁదలఁచియున్న నన్ను కారాగృహ బద్ధు నెట్లు చేసెదరురా ?

ఉద—మంత్రివర ! నీయభిప్రాయానుసారముగఁ గ్రూరసేనుఁ గారాగృహబద్ధుఁ జేయుట కిదియే సెల వొసంగితి. ప్రతాపా ! తప్పక రేపటియుదయమున నాకలుపాత్ముల బట్టి బంధించి కారాగారమం దుంచుము. లోభగుప్తా ! నీ వీఁక గృహమున కరుగుము. మనము నేఁటికి గొలువుఁ జాలింతము. (ప్రతాపున కాజ్ఞాపత్రమిచ్చును)

(అందఱు నిష్క్రమింతురు)

క్రూర—(పండ్లు గీటుచు) మంచిది ! నేనును నా ప్రకృత కార్య మాలోచింప నేఁగెదను. (నిష్క్రమించును)

## రెండవ రంగము

క్రూర—(ముందు ప్రవేశించి) ఔరా! ఎంతటి శక్తిహీను లెంతటి ధైర్య మవలంబించుచున్నారు.

ఉ. కావున నట్టివారి పను ♦ గర్వము శీఘ్రము మాపకున్న వా
రేవిధినైన ధైర్యము వ ♦ హించి యొనర్పకపోరు కీడు, రో
గావళి దాపురింపఁ బగు ♦ నౌషధ మీయక చూడ వృద్ధియై
యేవగఁ బ్రాణహానియగు ♦ నింతవిచారణ సేయఁ దొప్పదే.

ఏమీ! విచారణయా? యింకేమివిచారణ?

స్రగ్ధరా. తోడ న్సన్మించితం చ ♦ ద్భుత నయభయభ
♦ క్తుల్చెలంగంగ నే నే
కీడు న్జేయంగఁ జూడక ♦ గినుకఁ గలుగ ను
♦ ల్లంఘించె నన్నిట్లు వీని
న్నేఁడే మత్ఖడ్గధార ♦ న్నిహతునొనరుతున్
♦ నిక్క మెబ్బంగినైన
వ్వీడ న్వీయూఁపమే పో ♦ విమమగుఁ దడయ
♦ న్వేగ ప్రాణంబు లూడ్తున్.

ఏమది? ఇంకను నాయాజ్ఞానుసారులగు వీరపాల శూరపాలురు రాక జాగుచేయుచున్నారు.

వీర, శూర—(ప్రవేశించి) దేవరవారికి జయము, జయము.

క్రూర—మీకును జయమగుఁగాక!

వీర—మమ్మెందులకో త్వరితముగ రమ్మని యాజ్ఞ నొసంగినారఁట. వెంటనే తమయింటి కరుగఁ దామచట లేకుండుట గాంచి వెదకుచు నిచటికే తెంచితిమి. ఎన్నఁడిట్లు త్వరితమ్ముగ రమ్మనలేదు. నేఁడేమి దుర్భరకార్యధురంధరత కల్గె? సెలవీయ నిరీక్షించుచున్నాము.

క్రూర—అసమానశౌర్య ధైర్యగాంభీర్యులగు మీ యట్టి యనుచరులుండ నాకెట్టి కార్యమైన దుర్భర మగునా? కాని, వినరానివింత యొకటి పుట్టినది. తెల్పెద వినుఁడు.

ఉ. ఎన్నఁడుగాని తమ్ముఁడని ♦ యించుక ప్రేముడిఁ జూపకుండినన్
బున్నమటంచు నుంటి వల ♦ పోతనదా వినియుంటి రింక నే
మున్నది నేఁడు నన్నుఁ గర ♦ నోద్ధతి బద్ధునిఁ జేయనాజ్ఞ మా
యన్న యొసంగె నమ్మఁ జను ♦ నా భువి జ్ఞాతుల నెవ్వఁ డేనియున్.

ఇందులకు మన మేమి చేయవలయును?

శూర—ఏమేమీ? అంత నిర్భయముగ వచించెనా? మంచిది. ఎన్నఁడు వినని దీనవచనముల నుడువుచున్నారదేల?

తే. గీ. మనమున న్గొంక నేల యీ ♦ పనికి ? నెట్టి
పనికిఁగాని దుర్భరమహా ♦ బలుల మేము
కలుగఁ, దెఱచాప గాలికి ♦ నిలిపికట్టు
నోడ కడ్డుఁగలదె? భయ ♦ ముడుగుఁ డింక.

క్రూర—(తనలో) బళే శూరపాల! నీ వెన్నఁటికిఁ దగిన బంటువు. పరాక్రమశాలివి.

వీర—మహాధీరులగు మీరిట్లు చింతిల్లుట వింతగ నున్నది.

క. ఎరీ నీసరిపోటరు
లీ రేడుజగములలోన ♦ నిట్టి ఘనుని ని
న్నారా బంధించుట ? వి
స్తారోష్ణజలముల కిండ్లు ♦ దహనం బగునే.

మిమ్ముఁ గారాగృహబద్ధులం జేయుటకు మీ యన్నగారు కాదు; ముజ్జగము లేకమైవచ్చినఁ జేతగాదని నిశ్చింత నుండుఁడు.

క్రూర—వీరపాలా! యిట్టిసమయమున వా నీసాచి వేతమాటలు?

మ. భయమేమాత్రము లేక మంత్రియుఁజమూ ♦ పాలుండు యోచించి ఈ
క్రియ సేయుండని తెల్ప, మంచిదని తాఁ ♦ గేల్మోఁచి మా యన్న ని
ర్దయచిత్తుండయి బద్ధు జేయుఁడని ద ♦ ర్పంబొప్పఁ బల్కెంగ విం
చయ మోమిన్నక యెట్టులుందు నువయ ♦ స్యా యింతయూహింపుమా.

ఏది యెటులైనను, నిపు డిట్లోనర్ప నిశ్చయించితి.

మ. కృపలో నెంచక నేఁ జమూపతిని మం ♦ త్రిం జంపి, యాపైని దు
ష్టకటస్వాంతు మదగ్రజన్ముశిరమున్ ♦ ఖడ్గమ్మునన్ గోసి త

చపలాక్షి స్మరియించునప్పుడు మదిఁ • శాంతింతు, సందాఁక స్వ
యుపదేశంబు వినఁగఁబో నరివధో•ద్యోగంబుఁ జాటించుటన్.

క్రూర—వహ్వా! నిరుపమానచాకచక్యనిపుణులగు తాము యోచించినదే దివ్యమైన యుపాయము, ఇంక నాలస్యంబు కూడదని నా యభిప్రాయము

వీర—(తనలో) కటకటా! యెంతదుర్మార్గమున కొడిఁగట్టుచున్నాఁడు? కనుకనే, యీదుష్టునకుఁ గ్రూరసేననామము సార్థకపడినది. ఈక్రూరపాలుఁడో యుక్తాయుక్తవిచారశూన్యుడు. కీలుబొమ్మవలె నెవ్వరెట్లాడించిన నట్లాడుచుండును. నే నిప్పుడిందుల కొడఁబడకున్నఁ బ్రథమమున నన్నే తనకరవాలమునకు బలియిచ్చు, నిందు కేమిసేయుదును? (యోచించి) ఇట్లనిచూచెద. (ప్రకాశముగ) ప్రభూ! ఈకృత్యమెట్లొనర్పవలయు?

క్రూర—చేతులతో.

వీర—చేతులతోఁగాక, చెవులతోఁ జేయుదురా? అదికాదు. ఏమార్గముచేత?

క్రూర—ఏమార్గము యుక్తమో దానిచేతనే.

వీర—ఇదివఱ కేమార్గము నాలోచించినారు?

క్రూర—నీ కెట్లు తోఁచుచున్నది?

వీర—ఎటు చూచినను కష్టముగనే యున్నది.

క్రూర—నీ కటులే యుండును.

వీర—సులభముగ మీకుఁ దోఁచిన తెఱఁగెఱిఁగింపఁగూడదా?

క్రూర—నా కేమి? యెవరికిఁదోఁచిన నొకటియే యుక్తముగ నున్నది.

వీర—అది యేది?

క్రూర—ఏది యని యడిగెదవేమి?

చ. నరగఁ జమూపతి న్నచిపుఁ • జక్కఁడగించియు నేఁటిరాత్రి ని
ద్దురఁబడియున్న యగ్రజుని • దున్మఁగ నామది నిశ్చయించితిన్.

వీర—ఇదేటిన్యాయము?

క్రూర—చెప్పుచుండఁగనే తొందరపడియెద వేల?

చ. కురుపతికోర్కెఁదీర్పఁ దన ♦ క్రోధమునార్ప ధృతి న్వహించి యా
గురుసుతుఁ డుగ్రుఁడై! తలలు♦గోయఁడె పాండవపక్షయోధులన్.

వీర—(తనలో) హరి హరీ! ఎట్టిపాపపువార్త వినవలసివచ్చి నది. అయిన నిట్లు చెప్పిచూచెద. (ప్రకాశముగా) దేవా!

చ. గురుసుతుఁ డుగ్రుడై తలలు ♦ గోయఁగబట్టిగదా ఘటించె త
చ్చిరమునుఁబోలు సన్మణినిఁ ♦ జేకొనిపోవుట వైరు, లాతఁడో
చిరతరజీవి కానిమొడఁ ♦ జేరఁడె దండధరాలయంబు నా!
కరణిని బాపవహ్ని నొడిఁ ♦ గట్టఁగ నెంచ దహింపకుండునే.

కావునఁ బరాక్రమ శాలురకుం దగిన ధర్మం బొకటి నుడివెద. నాయందాగ్రహింపక వినుఁడు.

ఉ. వైరిని నాజిలో నెదిరి ♦ వాని వధించి జయంబుఁ గాంచి త
ద్ధారుణినెల్లఁ గైకొనుట ♦ ధర్మము రాజుల కొను మీర లా
తీరుఁ బరిత్యజించి పగఁ ♦ దీర్పుకొనంగ నధర్మవర్తనం
బారయ మేలె! కౌరవుల ♦ కందునసే కద నాశ మొందుటల్.

ఒకవేళ మీయన్నగారు దుర్మార్గుఁడే యనుకొనుఁడు. ఎదిరించి రణంబున విజయంబుఁగొని సామ్రాజ్యలక్ష్మిని వరించి సుఖంబుంట యుత్తమమని నేఁ దలంచెదను.

క్రూర—(తనలో) వీని కీపైత్యగుణ మపుడపుడు దొరలుచుండును. వేఱొక విధంబున వీనితో వాదులాడుచున్నఁ గాలహరణమై కార్యభంగ మగును. ఏదోయొక యుపాయమున వీని మనమును ద్రిప్పి మనోరథసిద్ధుఁడ నయ్యెదను. (ప్రకాశము) మిత్రమా! నీవు చెప్పిన మార్గము యుక్తమైనదియే. నేనది తెలియకపోలేదు; కాని

చ. కరులు రథమ్ము లశ్వములుఁ ♦ గాల్బలమూఁక లొకింత లేక సం
గర మొనరించి శాత్రవుల ♦ గర్వమడంచుట కెంతవారికిం
దరమగునే? యెదోసులభ ♦ దాయక యుక్తిని వైరిమారణం
బరయఁగ మేలుగాదె మన ♦ కాజినిఁ గష్టము లేల మిత్రమా!

ఇట్లు సేయక తప్పదు; నీ విందుల కిష్టపడక నా పరాభవముఁ జూడ నెంచెదవా!

వీర—(తనలో) ఈ క్రూరాత్ముఁ డెప్పుడును దాఁబట్టినపట్టు వదలఁడు. ఇందు కీయకొనక నాకుఁ దప్పదుగాని, వృథాకష్ట

మెంపులకుఁ జేయవలయు; నొకయుక్తిఁ బన్నెదను. (ప్రకాశముగ) దేవా! మనయూరిలో నున్న పెద్దశెట్టిగారికి వేయిరూప్యములు నే బాకీయుంటి, నందుల కాయనగా రిపుడు రూప్యములఁ దెమ్మని యింటి ముందు పీనుఁగువలెఁ బస్తుపడుకొనియున్నారు, డెచటనైనఁ దెచ్చి యాయనకిచ్చి యిపుడే వచ్చెదను. ముందు మీ రుభయులు జను చుండుఁడు.

క్రూర—(తనలో) ఆఁ! ఇదియా నీబెట్టు. మంచిది. (ప్రకాశ) ఓయీ! నీ వీధన మెచట తెచ్చెదవు?

వీర—ఎచట దొరికిన నచటనే.

క్రూర—ఎచట దొరుకును? వీధిలో నెవరైనఁ బాఱవేసి కొనిననా?

వీర—అటులు సులభముగ నాయట్టివానికి లభించునా? కాని యెవరిదగ్గరనైనఁ దీసికొని రావలయు.

క్రూర—ఎవరిదగ్గర?

వీర—ఎవ్వ రిత్తురో వారిదగ్గరనే.

క్రూర—ఇదివర కెవరినైన నడిగియుంటివా?

వీర—ఆశెట్టిగా రెప్పుడైన మా యింటిముందు పస్తుపడుకొని యున్నఁగదా, నే నీవఱ కెవరినైన నడుగుటకు!

క్రూర—సరే, బాగుగనున్న దిపు డెచటి కేగెదవు?

వీర—రూప్యము లిచ్చువారి కడకు.

క్రూర—ఇదివఱ కెవ్వరి నడుగ లేదంటివిగదా?

వీర—అడుగలేదన్న నే నెవరి నడుగఁగలను?

క్రూర—ఎవరి నడుగనిదే లేదను టెట్లు?

వీర—లేదనక తప్పునా?

క్రూర—నీ కెట్లు తెలియును?

వీర—మనస్థితి యూరివారికెల్లరకు విశదమేగదా?

క్రూర—సరే! నీ విప్పు డెవరి నడుగఁ దలచితివి?

వీర—ఇంక నెవరి నడిగిన నేమి లాభము?

క్రూర—(తనలో) వీనియుక్తి నే మొదటనుండి యెఱుగుదును.

ఇపుడు ధన మీయకున్నఁ జెప్పినమాట సరిగా వినఁడు. నేఁ దలఁచిన కార్యము గట్టెక్కినఁజాలు గాని వేయిరూప్యము లేమిలెక్క? రాజ్యమే నాదికదా. (హార మొకటి తీసి వీరపాలునితో) మిత్రమా! యీ మణిహార మా వేయిరూప్యములకు సరిపోవును. గాన త్వరితముగ నిచ్చిరమ్ము.

వీర—(హార మందుకొని తనలో) నా యుక్తిఫలించినది. (సంతోషమున బోవును)

క్రూర—శూరపాలా? శీఘ్రముగ నీ వేగి యాయుధము లాయత్తపరుపుము.

శూర—చిత్తము (అనిపోవును)

క్రూర—(నిష్క్రమించును)

శూర—(మరలఁ బ్రవేశించి) ఆహా! ఏమి యీధనమహిమ!

తే. గీ. తనువునైన విడువనొప్పు ♦ కొనునుగాని
ధనముఁ గలనైన విడ నొప్పు ♦ కొనఁ డెవండు
ఈతఁ డిపుడిట్టె శ్రీరంగ ♦ నీతు లాడి
విత్తముం గొని పనిఁజేయ ♦ వెడలినాఁడు.
ఇసీ! ఈపాపిధనము—

సీ. తలిదండ్రు లన్నద ♦ మ్ములగాని దారాసు
తులఁ గానీ జంపింపఁ ♦ గలదు ధనము
దేశదేశమ్ములుఁ ♦ ద్రిప్పి సకలవేష
ములను వేయింపఁగాఁ ♦ గలదు ధనము
కూటసాక్ష్యములకుఁ ♦ గొంకక న్యాయస
భలలోనఁ బొంకింపఁ ♦ గలదు ధనము
ఏమియు నెఱుఁగని ♦ హీనచిత్తులకడఁ
గొలువుండగాఁజేయ ♦ గలదు ధనము

తే. గీ. విరివిగా వేదకన్యాన్న ♦ విక్రయముల
సలుపగా బుద్ధి గలిగింపఁ ♦ గలదు ధనము
తథ్యమగు ధనమూల మి ♦ దంజగత్తు
టంచు వినుసీతి యన్నిటి ♦ న్మించు ధనము.

(నిష్క్రమించును)

3 వ రంగము: అంతఃపురము.

(కమలారాజ్ఞి, కీరవాణి యను చెలి ప్రవేశము)

కమ—(చేతులు జోడించి)

చ. పరమదయానిధే పతిత ♦ పావన చక్రధరాదిదేవ భా
స్కరశశినేత్ర రాత్రిచర ♦ కంఠవిలుంఠన మోహనాంగ శ్రీ
ధర వనమాలి భూరిభవ ♦ తాపనివారణ విశ్వరూపసుం
దర చరణారవిందయుగ ♦ తాపసరంజన పాహి పాహి మాం.

చెలీ! నే డేలకో నామనంబు కడుఁ జంచలంబై భయావృతమై యున్నయది. కడచినరాత్రి చెప్పరాని దుస్స్వప్నంబు గంటి. దుస్స్వప్నదోషపరిహారార్థము నిదురింపవలయునని యెంత ప్రయత్నించి నను నిదుర వచ్చినదికాదు. కుడికన్నేలకో యారక యదరుచున్నది. ఈ హేతువున మాకేమి యిక్కట్టులు గలుగఁబోవునోయనుభీతిచే శ్రీహరిని నుతింపుచుంటి, మాసర్వభారము లా భగవంతుఁడే వహించి రక్షించుఁగాక.

కీర—అమ్మా! కల యనఁ గల్లయనుట వినలేదా? వాత పైత్య శ్లేష్మముల తారతమ్యమున శరీర మపుడపు డదరుటలుజనులకు సహజమని తా మెఱిఁగినదియే. మఱల మనంబున కనుమానమేల? మీ కీ భయమేల? మీ రనిన ట్లా సర్వేశునిపై మనంబు నిలిపి సుఖ ముండుఁడు. క్కొ యొకానొక సమయంబున మాత్రము,

తే. గీ. స్వప్నముల శకునంబుల ♦ జనుల కిలను
భావిఫలసూచనలుఁ దెలు ♦ పంగఁబడును
గాసి తమదగు ప్రారబ్ధ ♦ కర్మమెట్టు
లైన ననుభవింపక తప్ప ♦ దనుట నిజము.

కమ—కీరవాణీ! నీవుపన్యసించిన నీతి మెచ్చఁదగినది. కాని నేఁడింత వఱకు నా నాథుఁడు రానికారణ మేమైయుండును?

కీర—అమ్మా! మనవీఁటంగల లోభగుప్తుం డను వైశ్యుని కూఁతును క్రూరసేనులవారు చెఱుపఁదలపడిన, విడిపించుటకై తండ్రి మొదలగు వారు చన వారి నందఱఁ జావమోదినారఁట.

అట్టి యువరాజుగారి దుండగమును మహారాజుగారితో మొరబెట్టు కొన లోభగుప్తుఁ డేగుచుండ నేఁ జూచితి.

కమ—హరిహరీ! ఎట్టి దుష్టబుద్ధి యగుచున్నవాఁడు! మా కెప్పుడును,

తే. గీ క్రూరసేనుఁ డేనాఁడు దుర్గుణము విడిచి
ధర్మమార్గానుగామియై ♦ తనయులట్లు
ప్రజలఁ జూచునోయని చింతఁ ♦ బడుచునుందు
మీశ్వరునిఁ జింతసేయుము ♦ నీంద్రులట్లు.

అయ్యయో!

ఉ. ఏగతి నా ఋణాందికి న ♦ శించునొ దుష్టగుణంబులంచు నా
నాగతుల న్విచారము మ ♦ నంబుఁ గలంప హితంబు నెంతయో
బాగుగ బోధఁజేయుదు ము ♦ పాయముతో వినఁడు-

కీర— ... ... ... ఏల తా వినున్
లాగుచుఁ గట్టుగట్టినఁ దొ ♦ లంగునె వంకర కుక్కతోఁకకున్.

కమ—నిజము. తా నెట్టివాఁడైన నేమికాని,

చ. తనను గుఱించి లోకులు వి ♦ దారుణబాధితు లౌచునుండి రం
చు ననుజుఁ డెన్నినాళ్ళకును ♦ క్షుద్రగుణంబుల వీడకుండె నం
చనయముఁ బాలుపోవక ధ ♦ రాధిపుఁ డక్కట గోయి నూయి మ
ధ్యను వసియించుమానవుని ♦ యట్టులఁ జింతిలుచుండుఁ దా మదిన్.

నిదురఁబోవుచున్నను నానాథుఁడు సోదరుని గుఱించి కలవరించుచు వ్యసనపడుచుండును.

కీర—యాదవకులమున ముసల ముద్భవించినట్లు క్రూరసేనుల వా రీవంశమున జన్మించి పూర్వులకీర్తినిఁ జెఱచుచున్నారు. తా మిందులకుఁ జింతిల్లి చేయున దేమి? అదిగో మహారాజుగారు రానే వచ్చుచున్నారు.

కమ—(చూచి యచ్చెరువున) చెలీ యదేమికారణము!

తే. గీ. కళల శోభిల్లు నాప్రాణ ♦ కాంతు మోము
కాంతివోయి చింతిలుచుంట ♦ గాననయ్యె
కువలయానందసంధాయ ♦ కుఁడగు పూర్ణ
చంద్రుని న్మబ్బుగప్పిన ♦ చందమునను.

కీర—ఏకారణమైనది యిపుడే తేలఁగల దీక్ష నేనేగుచున్నాను. (పోవును)

[ఉదయసేనుఁడు దుఃఖముతోఁ బ్రవేశము.]

కన—(లేచి) ప్రాణేశ్వరా! నమస్కరించుచున్నదాన.

ఉద—(ఊరకుండును)

కన—నాథా! మీ రిట్లు దీనవదనులై యుండుట కేమి కతము?

ఉద—(ఊరకుండును)

కన—(భయమునఁ దనలో) ఏమి యీవింత! యెంతకష్టసమయంబులనైన, నెంత చింతిలుచుండిననైన, నన్నుఁ గాంచినతోడనే యెంతయో ప్రేమించు నానాథుండు నేఁ డిట్లు పిలిచినను బలుకక కన్నెత్తియైనం జూడక చిన్నవోయి యున్నవాఁడు. కారణ మేమైయుండునో కదా! (ప్రకాశముగ) నాథా!

సీ. పరిపంథియూథంబు ♦ పురి చుట్టుముట్టిన
స్థితిఁజూచి యింత చిం ♦ తిలఁగ లేదు
తలిదండ్రులుం బందు♦గులుఁ జచ్చురీతిఁ గ
న్నులఁ జూచి యింత చిం♦తిలఁగ లేదు
తనయుఁడుఁ బుత్రిక ♦ మనకుఁ గల్గనినాఁడు
కలనైన నింత చిం♦తిలఁగ లేదు
తమ్ముని పెన్దుండ♦గమ్మునఁ బొరులు
గలఁగిన నింత చిం♦తిలఁగ లేదు
తే. గీ. అత్యధికకష్టములు గల్గి ♦నపుడు మీర
లిట్లు చింతిల లేదు నేఁ♦డేమికత మ
హా! యనుచు మది కడుఁ దామ♦రాకుపైని
జలముగతిఁ జలించుచునుండెఁ దెలుపుఁ డింక!

ఉద—దేవీ! యేమని తెల్పుదును?

మ. చెలికాఁ డాత్మసముండు సద్గుణుండు మ♦చ్చింతాపహారుండు ని
శ్చలభక్తిన్మనసేమ మారయుచు రా♦జ్యంబేలు ధీమంతునిన్
ఖలుఁడౌ క్రూరుఁడు చంపె నేమి పలుకం♦గాలేక యిట్లుంటి, హా!
తలగోయంబడు మొండెమట్లయితిఁ గాం♦తా! యింక నేమున్నదే.

కమ—అమంగళంబు ప్రతిహతమగుఁగాక! ఎంతకష్ట మెంత కష్టము. నానాథుఁ డెంత యధైర్యము నొందినాఁడు? ఇందు కేమి సేయుదు! కటకటా! నా కీవార్త కర్ణకఠోరంబై హృదయభేదన మొనర్చుచున్నను,

తే. గీ. భర్త చింతానిమగ్నుఁడై • పరఁగుచున్న
సమయమున నట్టిచింతలు • సమసిపోవు
నటుల సేయఁగఁదగును కు • లాంగనలకు
వినమె కార్యేషు మంత్రియం • చనెడు పలుకు.

అట్లగుచే నాభర్తకీ దుఃఖ ముపశమింపఁజేయుట నాకిపుడు కర్తవ్యము. (అని యుపచరింపుచు) నాథా! యూరడిల్లుఁ డూరడిల్లుఁడు.

ఉద—ఇంకెక్కడియూరట, నాతమ్ముఁ డొనర్చిన మేలిది. యొకటే యనుకొంటివా?

కమ—(సంభ్రమమున) ఇంక నేమున్నది?

ఉద—అయ్యో! ఎఱుఁగవా?

చ. అతులమహాబలుండు ఘనుఁ • డాహవతాండవకేళిభీముఁ డు
ద్ధతధృతిశౌర్యవంతుఁడు వి • దారితశత్రుఁడు విక్రమాఢ్యుఁ డ
ద్భుతవర తేజుఁడై తగు చ • మూపతిని న్వధియించె, నింక నా
స్థితి నడుగంగ నెక్కలను • దీసినపక్షివిధంబు గాదొకో?

కమ—కటకటా! ఎంతటి దుర్వార్త వినవలసివచ్చెను. ఇంక నానాథుని మనం బెట్లు స్థిరపఱతును. (రాజుతో) జీవితేశ్వరా! ఎట్టి యాపదలు వాటిల్లిన నింత ధృతిసెడి యమంగళవాక్యములం బలుకుట తమబోటి శూరుల కుచితమా? సర్వజ్ఞులగు మీ రెఱుఁగని ధర్మములు గలవా?

తే. గీ. సైన్యనాథుఁ డమాత్యుండుఁ • జచ్చె ననుచుఁ
జింతిలఁగనేల యీ సర్వ • జీవచయము
వేలు పుట్టుచుఁ గిట్టవే • వివిధగతులఁ
బరఁగ జాతస్య మరణం ధ్రు • వ మన వినమె.

ఒకరికి మాత్రము శాశ్వతమా! యెప్పుడో యేసమయమునవో యెవ్వరికేనిఁ జావు తప్పదని మీ రెఱుఁగరా?

ఉద—దేవీ! యెప్పటికేని చావు తప్పనిమాట వాస్తవమే యైనను, అన్యాయముగాఁ జూచుచుండఁగనే గొంతులు గోయుచుండ నెట్టి మహనీయులకైన నిట్టి నీతి స్మృతికి వచ్చునా? ఇంతలో సేనానాయకామాత్యులఁ జంపిన నాసోదరుఁడు నన్నుమాత్ర మిఁకఁ జంపకతప్పునా?

కమ—నాథా! యటులేల జరుగును? ఈయల్లిలోక్తు లేటికిఁ బ్రస్తరించెదరు?

ఉద—అయ్యో! ఇంతకన్న నల్లీల మేమున్నది? నాప్రాణ సమానులగు నమాత్యచమూపతు లంత మొందినపిమ్మట తాయినై నే జీవించుటయుఁ దుచ్ఛమే. నాతమ్ముఁ డేకవేళ నను జంపకున్నను నేనైన జీవముల విడుచుట నిశ్చయము.

కమ—మనోహరా! అమాత్యచమూపతులు ప్రాణసమానులు గాక యన్యు లగుదురా? ప్రియము గలవా రంత మొందినచో వారితోఁగూడ జీవముల విడుతురా? ఇది యెక్కడి విపరీతధర్మము?

సీ. దైవసమానులౌ ♦ తలిదండ్రులు గతింపఁ
దనయు లుండుటలేదె ♦ ధరణిలోన
తమతో సమానులౌ ♦ తమ్ము లంతమునొంద
నన్నలు బ్రతుకరే ♦ యవనిలోన
తనప్రాణమే యని ♦ తలచుఁ బ్రాణేశ్వరి
పడిపోవ నుండరే ♦ భర్తలు భువి
తమకడుపునఁ గన్న ♦ తనయులు మృతినొంద
జననీజనకు లిల ♦ మనుటలేదె

తే. గీ. అంతియేకాక తమవార ♦ లరగి రనుచు
వారితో నేఁగఁగలరెవ ♦ ్వారలైన
వృక్షశాఖలు నఱుక నా ♦ వృక్షము నశి
యించిపోనె మఱలఁ జిగు ♦ రించుఁగాని.

ఉద—నీ వుపన్యసించిన నీతి లోకభ్రాంతి వీడనివారికిఁగాని తదితరులకు బనికిరాదు. అయ్యో! యెట్టిగోలవు! నిర్దోషులైనప్రతాప

ధీమంతుల నిష్కారణముగఁ జంపివేసిన నాతమ్ముఁడు పాలివాఁడ నగు నన్నుఁ బ్రాణములతో విడుచుటకల్లం. ఏల యన ?

తే. గీ. కమలనాభుని మించు ర ♦ క్షకుఁడు లేఁడు
స్నేహితుని మించు చుట్టము ♦ క్షితిని లేఁడు
సద్గురుని మించు సుఖ మిచ్చు ♦ జనుఁడు లేఁడు
క్రూరుఁ డగు సోదరుని మించు ♦ వైరి లేఁడు.

వాఁడొకవేళ నన్నిపుడు దయదలఁచి విడిచినను నాకీ సకల కష్టదాయకమైన భూపరిపాలనమునందిచ్ఛలేదు. ఎట్లైనను బ్రాణములఁబాసి పరలోకసుఖుఁడ నయ్యెదను.

కమ——(భయదుఃఖములతో) అయ్యో, నాథా! తమ కేనెం తని చెప్పఁగల సమర్థురాలను! పాపము లన్నిటఁ జేరుకొన్నవి. పంచ మహాపాతకములనియు, వానిని మించిన దాత్మహత్యాపాతకమనియుఁ బెద్దలనుచుండ మీకెట్లు బరలోక మెట్లు లభింపఁగలదు? అదియు గాక దైవముఁ బతియు, గతియు నని స్థిరముగ నమ్మియున్న మీ యీసేవకురాలి కేమిగతిఁ జూపెదరు? విద్యాబుద్ధుల యందైన నారి తేరక పడసార మైదువత్సరము లుగలిగి ముందు మనకుగతులఁగల్పింప నున్న తారా కనకసేనుల కేమి గతిఁజూపెదరు? అకటకటా! వికలమనస్కులై యిట్లేల పల్కెదరు? తెలిసియో తెలియకయో యొక మనవిఁజేసెద. వినిన పిదపఁ గర్తవ్యమాలోచింపుఁడు.

చ. మతిచెడి భూమిపై బ్రతుకు ♦ మానిన నేమి ఫలంబు కల్గు? నీ
క్షితి మనసూనుఁడౌ కనక ♦ సేనున కర్పణఁజేసి యీ రమా
పతి నెదలో స్మరించుచు స్వ ♦ భావముగా మృతినొంద నిచ్చు న
ద్గతినతఁడే,దయామయుఁడు♦గాఁడొకొ యీశ్వరుఁడెంచి చూడఁగన్.

కావున మీ కతిభారముగఁ గన్పించెడి యీ భూమిని మన కుమారున కప్పగించి యే వనగిరిగుహాలలోనో వసించి హరిని స్మరింపుచుఁ గాలము గడుపుచుండుట యుక్తమని నే నూహించెదను.

ఉప——(తనలో) ఆహా! ఇట్టివి కదా కులాంగనలలక్షణంబులు!

తే. గీ. తపవరుఁడు వికలతఁ జెంది ♦ ధైర్యహీనుఁ
డై చతతి నీతి బోధించి ♦ యమలమార్గ
వర్తనుఁగ నొనర్చు సుగుణ ♦ వనిత, నీట
నావ నడిపెడు చుక్కాని ♦ నరుని కట్లు.

(ప్రకాశముగ) ప్రాణేశ్వరీ! నీవు బోధించిన హితము బహు యుక్తమైనది. ఇంక నాయందున్న సర్వభారములు కనకున కప్పగించెదను.

[తారా కనకసేనులు ప్రవేశము]

తారా-కన—జననీజనకులారా! వందనము లొనర్చెదము.

ఉద-కమ—చిరుతలారా! మీకు శుభం బగుంగాక!

తార—(పరికించి) పూజ్యులైన మా తలిదండ్రుల కింత చింత వాటిల్లినది?

ఉద—తండ్రీ! కనకసేనా! ఇటు రమ్ము.

కన—(శోక కోపముతో) జనకా!

క. మన సేనాని నమాత్యుని
ననుమానము లేక చంపె ♦ నఁట క్రూరుఁడు నీ
యనుజుఁ డని విడువఁ బాడున
కును బాల్పోసిన విధం బ ♦ గుం దెలియవొకో.

ఉద—(కన్నీరుతో) కుమారా! పిట్టపిడుగువంటి యీవార్త నెవ్వ రెఱింగించిరి?

కన—ఈ మాయప్పవలన వినియుంటిఁగాని మీ రాదు నేల మన్నించి విడిచితిరి?

ఉద—తనయా! నేఁటిపథను వానిఁ గారాగృహబద్ధుం జేసి నట్లు ప్రశాంతధీమంతుల కాజ్ఞ యొసఁగినాఁడ. ఆవ్వార్త నెట్లాదుష్టు డెఱింగెనో నిర్దోషులగు నా ప్రాణసమానుల నింతలోనే యంత వధించినాఁడు. తండ్రీ! అట్టివాని విడువక నే నెవరిచేతఁ బట్టి తెప్పించి శిక్షింపఁగలను?

కన—అటులైనఁ దండ్రీ! చింతిలకుఁడు! ఆదుష్టు నెటులైన నుదయమగువరికి నేఁబట్టి కారాగృహబద్ధుం జేసెద.

ఉద—పుత్త్రీ! పదసార మైదువత్సరముల బాలుఁడవు నీ వా దుష్టుని తెరవు పోకుము. ఎటులో యుపాయముగ వర్తించుట ముఖ్యము. అలవికాని వేళ నధికుల మనునది యక్కఱకు వచ్చునా? నీ విఁక తారాసహితముగ శయనింపుము.

కన—(తనలో) ఇప్పు డిందుల కేమిమాటాడినను వలదని వారించును. ప్రస్తుతము మిన్నకుండి యుక్తిచే నాదుష్టుని బంధింప వేచియుండెదను. (ప్రకాశముగ) అప్పా! శయనింతము రమ్ము.

తార-కన—(శయనింతురు)

ఉద—ప్రాణేశ్వరీ! మిన్నువిఱిగి మీఁద బడినట్లు పెద్దనిద్దుర వచ్చుచున్నది. ఇంచుక నిద్రించెద. (శయనించును.)

కమ—(తనలో) అమంగళము ప్రతిహతమగుగాక! ఆహా! ఏమి యీదుర్దినము. నా నాథుడు నేఁడేది వచించినను నశ్లీలములే వెడలు చున్నవి. ఏమికీడు మూడనున్నదో కదా! ఓ జగద్రక్షకా! ఈశ్వరా! సదా నీవే గతియని నమ్మియున్న మమ్ము రక్షింపుము. [భర్తను జూచి] అక్కటా! నానాథుఁ డెంత తేజోహీనుఁడై నాఁడు. నానాథునిఁ జూచిన నా కేమో గుండె లవియుచున్నవి. ఉదయము నుండి యపశకునములు సూచించుచున్నందులకు సేనానాయకామాత్యుల మరణవార్త వినుటయే ఫలమయ్యె; నింక నెందుననో కుడికన్నదరుచునే యున్నది. ఏమి చేయుదును! నాకును నేఁ డేదో విపరీతముగనే నిదురవచ్చుచున్నది. కారణ మేమో యెఱుకపడదు. దైవ మేమిచేయ నుండెనో! (భర్తపదము లొత్తుచు) ఓదేవా! సర్వేశ్వరా!

చ. పతితము నిన్నుచిత్తమున ♦ సంస్మరియింపుచునున్న మమ్ము నీ
గతి నలయింప న్యాయమొకో?♦ శాపము మాకడగండ్లు వాపి, శ్రీ
పతి! సకలాంతరాత్మ! నవ♦పద్మదళాక్ష! హరీ! మురారి! యో
యతిజనసేవ్య! సర్వసుజ♦నావన! దానవగర్వభంజనా!

(భర్తపదములపై దల నిడుకొని పరుండును.)

క్రూర — (కత్తితోఁ బ్రవేశించి తనలో) శిక్షింపుమనిన మంత్రి యు, నన్నుఁ బట్టెదనని ప్రతినఁజేసిన సేనాపియు నంతమొందిరి. ఇంక నన్నుఁగూర్చి సదా విలపించెడి యా చేతగాని ప్రభు వేడి? (అని పరికించి పరుండియున్న యుదయసేనుం జూచి వీరపాల శూరపాలుర సంజ్ఞలచేఁ బిలిచి మెలమెల్లఁ జని సచివు లిరువురు కత్తుల భయంకర ముగ నెత్తి కమలా కనకసేన తారల చెంతను, తా నుదయసేనుని యెదపైఁ గూరుచుండి గొంతుగోయుట, కనుల మొదలగువా రాహా కారము లొనర్ప సచివులు బెదరించుట! క్రమక్రమముగ యవనిక పడుట.)

ప్ర థ మాం క ము.

సంపూర్ణము.

"ఓవర్సీడాటర్"

గ్రంథకర్త:-కోపల్లి వేంకటరమణారావుగారు.

ఈనాటకమును బెక్కునాటక సమాజములవారు హైదరాబాదు మొదలుకొ ఒరిస్సా జిల్లావరకుఁ బ్రదర్శించినచోట్లనే ప్రదర్శించుచుఁ బేరుప్రతిష్ఠలుగాంచి మేలిమి బంగారమువంటి సాంఘిక నాటకము. ఇల్లాలును గోల్పోయి, తన యేకై పుత్రిక ముఖముఁజూచుకొని యెటులనో జీవించుచున్న గోపాలరావుగారి యద్వి యమైన పుత్రికావాత్సల్యము యందుల నామె యతి బాల్యవైధవ్యమునకు వా లోలోన పడు సంతాపము, యామె సంగీతపు మేష్టరుని ప్రేమించి వానినిఁ బెం చేసుకొనెదనని వెల్లడించునపుడు సంఘశృంఖలమును దెంపలేక వారుపడిన మన వ్యథ, తుదకుఁ బిచ్చియెక్కి యావల తనకుమారితను వరించిన సంగీతపుమేష్టరు రక్షింపబడి తనపుత్రికా సౌఖ్యమే పరమావధిగా పెంచి యామెకు బహిరంగము ద్వితీయవివాహము చేసిన యొక గౌరవనీయుని కుటుంబ చరిత్ర. సుందరమ్మ సంగీ పుమేష్టర ప్రేమ... అప్పలమ్మ సుందరమ్మను వేయికండ్లఁ గనుపట్టుచు నామె వా రోగ క్షేమములు తనవిగాఁబాటించిన దాసి. ఆమెభర్త వెంకటరెడ్డి_ఆ అప్పలమ్మ రహస్యముగా ప్రేమించుచున్న శంకరమను నొక దంభబ్రాహ్మణుడు_వాని భార్య గంగమ్మ_వీరందరినిఁ గథలో చొప్పించినవిధము మనోహరముగా నుండును. ముద్ద లొలుకు పండితపామర జనరంజకమగు సాంఘిక నాటకము.

వెల 1—0—0



ఓం

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః
అస్మద్గురుభ్యోనమః

# కనకతారా నాటకము

## ద్వితీయాంకము

### 1వ రంగము

కంచు—(ప్రవేశించి) ఆహా! ఏమి యీవిపరీతము! ఈ యర్ధరాత్రమున రాజుగారి శయనగృహమున నేదియో పెద్ద కలకలము జరిగినపిదప హాహాకారములు మెండయ్యె. హేతు వేమి చెపుమా? (యోచించి) ఏమియుఁ దోఁచకున్నది. ఇంతకుమున్న మహారాజుగారు తన సేనానాయకామాత్యులఁ గ్రూరసేనుఁడు చంపినాఁడని దీనులై దుఃఖింపుచు శయనగృహముఁ బ్రవేశించినారని సేవకాధిపుండగు సులోచనుండు నా కెఱింగించి చనియె. మఱల నింతలో నట్టి ఘోర మేమైనఁ బొసగియుండదుకదా? ఆ కలకలముఁ బట్టిచూడ నిశ్చయముగ మఱల నేదియో కీడు మూడినట్లే యున్నది. (ముందునకుఁ జూచి) అదిగోఁ బహారాబంట్రౌతగు గిద్దాఖాన్ పరుగిడుచు వచ్చుచున్నాఁడు. వానివలన నేమైనఁ దేటపడవచ్చును.

గిద్దా—(ప్రవేశించి) యాఖుదా! యాఅల్లా! హాంకూ బచాదేవ్, బచాదేవ్, బచాదేవ్, (అని భయమున వంగివంగి సలాములు చేయును)

కంచు—(గిద్దా వెన్నుఁదట్టుచు) (గిద్దాఖాన్! నీ కేమి యాపద మూడినది? ఈ సంభ్రమ మేమి?

గిడ్డూ—(అదరిపడి) అరే అయ్యా! తేరే పాంవడ్తాహుఁ మై లాచార్ హుం గరీబ్ హుం, మాఫ్ కరో, నీదీజకర్కి-రాలేదు హుఁకుబచాదేవ్ నీకీ హజార్ సలాం (మఱిమఱి సలాములుచేయును

కంచు—(తనలో) ఏమది! యీతఁ డిట్లు విభ్రమపడు చున్నాఁడు! ఇందుకుఁ దగిన హేతువేదియో యున్నది. (ప్రకాశము గిడ్డూ! నే నెవ్వరనుకొంటివి? నీ కీ విభ్రమ మేటికి?

గిడ్డూ—(వణకుచు) మహారాజ్! ఆప్ హంకూ ఖుదాతో పెద్ద. మాబాప్‌లోటి బడా, ఛాయీ బంధూసే బెహాత్తర్. మే బేఖుసూర్ వున్నాఁడు. మాదీఖుసూర్కి మాపుసెయ్యండి. ఆ సర్దార్ ఖుహూర్ సేన్ మహారాజ్ వున్నాఁడని నిద్రాసేసినాఘూఁ హులీకి పడ్తాం.

కంచు—(తనలో) ఓహో వీఁడు నన్నుఁ గ్రూరసేనుఁడ భావించి నట్లున్నదే! నే ననుకొనినట్లు క్రూరునివలన మహారాజుగా కేదియో యిక్కట్టు సంభవం బయ్యేనేని తోఁచుచున్నది. (ప్రకా ముగ) గిడ్డూ! నేఁ గ్రూరసేనుడనుగాను; వృద్ధకంచుకిని. నీవే భయపడుచున్నావు? ధైర్యమవలంబించి నీతొట్రుపాటునకుఁ గార మెఱిఁగింపుము?

గిడ్డూ—(ఆశ్చర్యముతో) అఁ-అఁ-అరే (సురలఁ పారఁజూ అరే కంచుడయా! నీకీ జూసీ మాంపానంవాఁడు వల్లిపోయినాడి అరే అప్పటిసంది యెందుల్కి మాలుంసెయ్యలేదుబే. నువ్వు ముసి వున్నావ్ ఘానీ మాకీయెంతఘుబరాట్ సేసినావురే. (ఉలికిపడి) అ నవ్ యిఖ్డా యెందుల్కి నిల్సున్నావురే. ఖుహూర్‌సేన్ వాడువచ్ నాకీ నీకీ ఖత్తితో ఖంట్లంకి సఫాసేస్తాది. (దీనతతో) అరేభాయి మాకీ పానాబుగుల్ అయితావుండావ్. మాకీ జల్దా బచాదేవ్ కంచుడయా.

కంచు—(వెన్నుఁదట్టుచు) గిడ్డూఖాన్ భయమునొందకుము క్రూరసేనుఁ డెచ్చట నున్నాఁడు? మనల నెందుకు చంపును?

గిడ్డూ—(మఱల నుల్కిపడి) అరే! హాన్కి పేర్ మాముదు సెయ్యకే. హాన్పేర్ మాంపానంల పడ్తే మాజాన్‌వాఁడు వెల్లిపోత

దిశే, నీకాల్కీ మొఖ్తాగాని ఆల్సెం సెయ్యక్కే జల్దీ భాగ్నా చెలో శే
అయ్యా, చెలో శే.

కంచు—(తనలో) వీఁడింత భీతినున్న వాఁడే! ముందేమి దుర్వార్త వినవలసియున్న దో కదా! (ప్రకాశముగ) గిడ్డూ! వలనీకీ విభ్రమము? క్రూరసేనుఁ డిచ్చటికి రాఁడు. నేఁ జూచుచుండెదను కాని నీభయమునకు హేతు వేమో సవిస్తర మెఱుకపఱుపుము.

గిడ్డూ—అరే! హెంత పిచ్చిమన్సి వుండావ్ జే. ఆవల్కీ మెల్లి మర్ఘూచూపోఁని ఘూసుండి అంతామాటా నీకీ ఘూలుం సేస్తా ఘూవి యిప్డూ యిష్టూతో టే జల్దీభాగ్నా చలోశే.

కంచు—గిడ్డూ! ఇదియు నొక మఱుగుస్థలమే. నీవు నందే హింపకుము, జనులు సదా నడుచుచుండెడిమార్గ మిదికాదు. ఇది పద్గ్రింథకాలత్నెఱమున కేర్పడినస్థలము; క్రూరసేనుఁ డీస్థలమునకు రాఁడు; ఒకవేళ వచ్చినను శిరోబాధ జనించి తిరిగి పోఁగలఁడు; నీ విఁక భయము మాని కారణ మెఱిగింపుము.

గిడ్డూ—(స్మృతి నభినయించి) హా, హా, నిజ్మ, నిజ్మ, మేం ఘూడా హాస్పయానికి మర్సినాం, హాహాహాహా యిప్పుడు బతీకీనాం.

[అని మొదలు నవరించుకొనుచుండును]

కంచు—గిడ్డూ! చెప్పవేమి?

గిడ్డూ—ఏంటి?

కంచు—కంచు—ఓహో మఱచితివా! అప్పటినుండి నే నేమడుగుచున్నాను?

గిడ్డూ—హా! హా! యేంశప్పాలయా? మేం పెందల్ఖాడా న్హాష్టాచేసి మా ఫారాఖోల్వికివచ్చి కొంతసే ఫ్ఫారాసేసినాం. అప్డా మాకీ నిదరా దయ్యంవాడు ఖట్టినావ్. మేం సోగయా.

కంచు—తరువాత?

గిడ్డూ—తర్వాత ఖొంతసేపటికీ అందర్ ఘుందర్ ఘూలం హిన్పడి, హుల్కీ పడి ఖన్నువాన్కీ ఖులాయించి చూచినాం,

కంచు—చూచిన—

గిడ్డూ—(అదరిపడి) హాఁ! హాఁ! కంచుడయా! అటుసూడు అటుసూడు (అని మీఁదఁబడుచున్నాఁడు)

కంచు—(వెన్నుఁదట్టుచు) గిడ్డూ ! అచట నే
మవలంబించి కనులు విప్పి చూడుము.

గిడ్డూ—(కొంతతడవునకు నెమ్మదిపడి) అరే
యెంతఫిర్కీ-వాఁడు అయినాం (కంచుకితో) అరేకంచు
ఖన్నవానికి ఖులాయించి సూసినప్పు యేలాగా ఘన్న
రూర్ సేన్ వాడు యిప్డూఘూడా హాలాగా ఘున్పడి వ
మెల్లిపోయినావ్ రే.

కంచు—మఱియేమిభయములేదు. శౌర్యము
దీయు లిట్లు జంకుట పరువుకాదు. ధీరుఁడవై తరు
జెప్పుము.

గిడ్డూ—(తనలో) హా మాదీఖులంవాడుచూ
అని మామీద వ్రాస్తాడు ఘనక బహుత్ హిక్మత్ సై
యే. (కంచుకితో) అరే కంచుడయా ! నీకీ ఖుదావరీ
మేంఖన్న వానికి ఖులాయించి సూసీతలీక ఆఖురు
తల్వార్ సేల్లా పట్ఖోని ఆని కష్టాలంతా రక్థం సేసి
హేబ్ జుట్టు బట్ఖోని, పెద్ధా రాచ్ఛాసిలాగా ఘుంజా
కంచు—హా ! పాపము శాంతించుగాక. ఆహా
మహారాజా ! నీ కెట్టి దుర్మరణము తటస్థించెను.

సులో—(ప్రవేశించి) ఎవరిచట ?

గిడ్డూ—(అదరి కంచుకిపైఁబడి) అరే, కంచుడ
చుడయా అరే ! అల్లా మైమర్గయా ! మర్గయా కంచు
బచావ్ బచావ్ !

కంచు—(సులోచనుఁజూచి గిడ్డూతో) గిడ్డూ
త త్తరించెదవు ? ఇతఁడు సేవ కాధిపుఁడగు సులోచ
కొందరుము. నీ పటు కూరుచుండుము. మహారాజ్ఞిగ
తెలిసికొందము. (సులోచనునితో) సులోచనా ! ని
కపరిమిత భయ ముత్పన్న మగుచున్నది. అంత
గుశలమా ?

గిడ్డూ—అరే కంచుడయా ! మాపానంవా
పోయినావ్, జరా దేఖో అయా ?

కంచు—(వెన్నుఁదట్టుచు) గిడ్డూ ! అచట నేనున్నది ! ధైర్య మవలంబించి కనులు విప్పి చూడుము.

గిడ్డూ—(కొంతతడవునకు నెమ్మదిపడి) అరేబాప్రే ! మేం యెంతఫిరికీ-వాఁడు అయినాం (కంచుకితో) అరేకంచుడయా ! మేం ఖన్నువానికి ఖులాయించి సూసినప్పు యేలాగా ఘప్పడినావ్. అఖురూర్ సేన్ వాడు యిప్డూఘూడా హాలాగా ఘప్పడి మాది జాన్ వాడు యెల్లిపోయినావ్ రే.

కంచు—మఱియేమిభయములేదు. శౌర్యముగల మహాత్మదీయు లిట్లు జంకుట పరువుకాదు. ధీరుఁడవై తరువాతి సంగతిఁ జెప్పుము.

గిడ్డూ—(తనలో) హా మాదీఖులంవాడుచూస్తే అఖ—థూ అని మామీద వూస్తాడు ఘనకి బహుత్ హిక్మత్ సే రహ్నా చాహియే. (కంచుకితో) అరే కంచుడయా ! నీకీ ఖుదాపరీకాసూసీ సెప్తాం, మేంఖన్ను వానికి ఖులాయించి సూసేతలీకి అఖురూర్ సేనువాఁడు తల్వార్ సేల్లా పట్కోని ఆని కష్టాఅంతా రక్తం సేసోకీసీ, రానీసాహేబ్ జుట్టు పట్కోని, పెద్దా రాచ్చాసిలాగా ఘుంజూరావస్తుండాడురే.

కంచు—హా ! పాపము శాంతించుగాక. ఆహా ! ఉదయసేన మహారాజా ! నీ కెట్టి దుర్మరణము తటస్థించెను.

సులో—(ప్రవేశించి) ఎవరిచట ?

గిడ్డూ—(అదరి కంచుకిపైఁబడి) అరే, కంచుడయా అరే; కంచుడయా అరే ! అల్లా మైమర్గయా ! మర్గయా కంచుడయా ! హాంకు బచావ్ బచావ్ !

కంచు—(సులోచనుఁజూచి గిడ్డూతో) గిడ్డూ ! ఏల యిట్లు తత్తరించెదవు ? ఇతఁడు సేన కాధిపుఁడగు సులోచనుఁడు. భయమొందకుము. నీ వటు కూరుచుండుము. మహారాజ్ఞిగతి యేమైనదో తెలిసికొందము. (సులోచనునితో) సులోచనా ! నిన్నుఁజూడ నాకపరిమిత భయ ముత్పన్న మగుచున్నది. అంతఃపురవాసులకుఁ గుశలమా ?

గిడ్డూ—అరే కంచుడయా ! మాపానంవాడు వున్నావ్ పోయినావ్, జరా దేఖో అయా ?

సులో—గిద్దూ! యేల నీ కీభయము? అటుకూరుచుండుము.

గిద్దా—(కోపముతో) అరే నీకియేం ధున్నలాగా వున్నావ్.

కంచు—సులోచనా! భీతవార్ధిలోఁబడిన నాచిత్తముందరి జేర్పుము.

సులో—తాతా! చెప్పున దేమికలదు. వనితావధీమంతు లంత మొందిన దిదివఱకే నివేదించి యుంటిఁగదా?

కంచు—అవును. ఇపు డిపుడే మహారాజుగారి మరణసూచనయు నీ గిద్దూవలన విన్నాను. కాని వివరముగ తెలియలేదు.

సులో—వివర మేమున్నది. అమాత్యచమూపతుల సద్గుణములఁ దలచుచు సతీపతులు కొంతతడవు విలపించి దేహములు మరచి నిదురించుతఱిఁ క్రూరసేనుఁడు—

గిద్దా—అరే! నీకీవలాం, హా న్వే ర్తేకురా. మాకీ ఘుండల్ వల్గులది.

కంచు—గిద్దూ! యూరకుండుము.

సులో—తాతా! ఆ ఘోర మేమని తెల్పుదు!

తే. గీ. శివుఁ డొసంగిన ఖడ్గంబుఁ ♦ జేతఁబట్టి
దారిని తున్మ దుపదపుత్రు ♦ తలను తొల్లి
యటులనే ఖడ్గధారియై ♦ యన్న శిరముఁ
గోసె నిర్దయచేత నా ♦ క్రూరుఁ డకట!

గిద్దా—(భయమున దనలో) సచ్ హులంగా హై.

కంచు—అయ్యయ్యో! ఉదయసేనమహారాజున కెంతటి దిక్కుమాలిన దుర్మరణము తటస్థించెను!

సులో—తానంతటంబోక పతివ్రతామతల్లియగు కమలాదేవిని-

తే. గీ. చేతితో శిరోజంబులఁ ♦ జిక్కఁబట్టి
భోరుమం చేడ్వఁగా నీడ్చి ♦ భూమిమీఁదఁ
జలముచే వేణిఁబట్టి దు ♦ శ్శాసనుండు
ద్రౌపదిని సభ కీడ్చు లె ♦ ఱంగుదోఁచ.

గిద్దూ—అరే! ఫిర్ ఫిర్ అదేమాటసెప్తా. పానముంటె బల్చు కూర దినవచ్చునని తెలఁగిసెప్తార్, యిఖ్హా మాకి యిప్డూ పనియేం. ఘర్కాజాకర్ బచ్చేకచ్చేమే పడుంగా. (నిష్క్రమించును)

కంచు—అయ్యయ్యో! ఆ సాధ్వీతిలక మా దుష్టాత్మునకే మపకారము చేసియుండును?

సులో—తక్కినవా రందఱుమాత్ర మేమిచేసిరి?

కంచు—హా! కమలాసాధ్వీమణి! నీవుకూడ నీ నాథునిఁ జేర వరగితివా?

సులో—అయ్యో! అటులే జరిగిన నింతవిషాద మేల?

కంచు—అటులకా కింకేమి చేసినాఁడు?

సులో—ఆదుర్మార్గ మెట్లు వచింతును?

క. ద్రౌపది సింహబలునిచే
భూపుత్రి దశాస్యుచేత ♦ మును నిందులకై
తాపంబు నొందిరో? నేఁ
డావగిదిన క్రూరుచేత ♦ నాపెయుఁ జిక్కెన్.

వాతావధూతంబైన పతాకంబుచందంబున, నరిలోఁదవిలిన హరిణంబుపోల్కి నవదయై విలపించుచున్న నట్టిఘోరముఁ జూచి భరింపలేక నీ కెఱిఁగించుట కేతెంచితి.

కంచు—హా తల్లీ! పరమసాధ్వీమతల్లీ! నీ కెట్టికష్టములు సంప్రాప్తించినవి! ఆ యవ్యక్తపు బ్రహ్మదేవుఁడు—

తే. గీ. ధరను ధర్మాత్ములను యశో ♦ ధనుల ఘనుల
కష్టములపాలుఁ గాఁగను ♦ సృష్టిజేయు
దుష్టవర్తనులకు నేమి ♦ దుఃఖమీఁడు
వినమె పాపీచిరాయు వం ♦ చనెడు నీతి.

సులో—ఇందునసే కాఁబోలు, నావిధికి గుడీగుండము లేకపోయినది.

కంచు—ఏదియెటులైననేమికాని యిపుడామెకష్టము లెవరుతప్పింతురు?

సులో—నరేకాని తాతా! పూజ్యులైన జననీజనకుల గర్భమందునను, సుగుణఖని యగు నుదయసేన మహారాజునంతటి యగ్రజునితోడను ఈ దురాత్ముఁడగు క్రూరసేనుఁ డుద్భవించుట వింతగా నున్నది.

కంచు—సులోచనా! ఎంత వెఱ్ఱివాఁడవు?

తే. గీ. అధములకుఁ బుట్టుదురు యోగ్యు ♦ లైన సుతులు
ముండ్లచెట్లులకు గులాబి ♦ పూవుకరణి
అనఘులకు బుట్టుదురు హీను ♦ లైన సుతులు
అమృతజలధియందును హాలా ♦ హాలముకరణి.

[తెరలో]

తే. గీ. ఎచటి కేఁగెదు విడువ నే ♦ నింక నిన్ను
నెవ్వఁ డడ్డుపడెడువాఁడు ♦ పువ్వుఁబోఁడి!
నేఁ దలంచినపని వృథా ♦ కాదు సుమ్ము
ఖగపతికిఁ జిక్కు-సర్పంబు ♦ గదలఁగలదె?

కంచు—(ఆలకించి వేగిరపాటుతో) ఏమిదీ?

సులో—(ముందుకుఁ జూచి) ఆహా! పులినోటఁబడి తప్పించు కొనులేఁడి చందంబున నుదయసేనభూపతిపట్టమహిషి యదిగో! కౄరుని బారినుండి తప్పించుకొని పోవుచున్నది. ఎచటి కేఁగఁగలదు? ఎవ్వ రడ్డుపడఁగలరు?

కంచు—ఆక్రూరున కోపాటించి తప్పించువాఁ డీఁక బుట్టి రావలసినదే. ఆతల్లి పాతివ్రత్యమే యామెను రక్షించుఁగాక. సులో చనా! మనమిట నున్నఫల మేమి? పోయిశక్తికొలది యోచింతము రమ్ము.

(నిష్క్రమింతురు.)

## 2వ రంగము:—సముద్రతీరము.

కమ—(ప్రవేశించి) ఓ దీనదయాపరులారా, ఆర్తరక్షకులారా, భూతదయాళులారా—రక్షింపుఁడు. రక్షింపుఁడు.

సీ. సురలార మునులార ♦ హరిసుధాకరులార
పాపరే క్రూరుని ♦ బారి మీరు
నరులార యో వన ♦ తరులార కరులార
పాపరే క్రూరుని ♦ బారి మీరు
హరులార శార్దూల ♦ వరులార గిరులార
పాపరే క్రూరుని ♦ బారి మీరు
తరులార కాంతార ♦ చరులార కిరులార
పాపరే క్రూరుని ♦ బారి మీరు

తే. గీ. పాపియై, నిద్రఁజెందు నా ♦ పతిని జంపి
నన్నుఁ జెఱఁబట్టఁదలచి తా ♦ నున్న వాఁడు

జంటపక్షిని గోల్పోయి ♦ చక్రవాకి
పొక్కుచున్న నరిం బెట్టు ♦ బోయభంగి.

అయ్యయ్యో! ఎంత వేడుచున్నను నొకరైన వచ్చి రక్షింపరైరి. ఆహా! దైవమా! నాకెట్టి యాపద ఘటింపఁజేసితివి? శైశవమందు సైత మెట్టి జీవముల కేమాత్రమైన కీడొనరింపని నాకిట్టి డిట్టిగడువ రాని యిక్కట్టులు కల్పించుట పాడియా? ఓ ప్రాణేశ్వరా! నా యీ యమానుషమును జూచి పరితపింపకుండ సోదరధర్మము విచారించినీ తే.
యనుజుండు నిన్నుఁ జంపుట నీ కొకవిధమున మేలొనరించుటయే. నీ సతి యీ గతి ననాథయై, యురిలోఁ దవిలిన శుకంబు చందంబునదుష్టుఁడగు క్రూరసేను బారింబడి తప్పించుకొనుటకు దిక్కులేక పొక్కుచున్నది. శీఘ్రమే యేతెంచి మానుషమును కాపాడుము. ఎట్టిహీనుఁడైనను భార్య పరువిచేఁజిక్కి పరితపించుచుండఁ జూచి సహింపఁగలడా తే.
యిప్పుడు నీవేలవచ్చి రక్షింపవు? అయ్యో! యీ నిర్భాగ్యురాలి కాపాటి భాగ్యమున్న నింకేమి కొదువ? నిన్నుఁ జంపిన నీయనుజుండు నన్నేల చంపక యిట్లు నిర్బంధింపఁ జూచెనో! నిన్ను నీ యనుజుండు చంపు తఱి నన్ను గూడఁ దన ఖడ్గధార కెరజేసినచో నాకీ పరితాపము లేకుండుగదా! ఎట్టియాపదలు మూడినను, ఏసమయమునందైనను, నిన్నొక గడియ యెడఁబాసి యుండఁగలనా! ప్రాణేశ్వరీ యని యేకాంతమున నన్ను బుజ్జగించినది మఱచిపోయి నేటికీ హీనుని బారింబడి మొండివై బ్రతుకుమని విడిచి చనితివా! అయ్యయ్యో! ఓభక్తరక్షకా! సర్వేశ్వరా! నన్నీదుష్టుని బారినుండి తప్పించియాపన్నరక్షకుండవను బిరుదు వహింపుము. ఓసర్వసాక్షీ! లోకచక్షూ! నీవైన రక్షింపుము. ఓమహేంద్రాదిదివ్యులారా! మీరైన రక్షింపుడు. ఓ వనమృగములారా! దయ గలిగినచో మీరైన రక్షింపుఁడు. లేదా భక్షింపుడు. (సముద్రమును జూచి) ఓ సర్వజీవనాధారా! సముద్రుఁడా? ఎందఱి వేడిన నొకరైనరక్షింప రారైరి, ముంగొంగుధనమువలె నీవే నాకుఁ బ్రత్యక్షమై యున్నవాఁడవు. (నమస్కరింపుచు)

సీ. దశరథాత్మజునకు ♦ దారి సత్కృపఁ జూపి
వైదేహికడగండ్లు ♦ వాపి తీవు

బలమథనునిబారిఁ ♦ బడి యార్తిఁజెందెడి
మైనాకునిం గాంచి ♦ మనిచి తీవు
అమృతంబు నిచ్చుట ♦ కాధారకుండవై
సురలు గెల్వఁగ దారిఁ ♦ జూపి తీవు
భగవంతుఁడు వికుంఠ ♦ పనికిఁ గన్యాదాన
మిచ్చి సత్కీర్తిచే ♦ నెనసి తీవు

తే. గీ. భువి నఖిలజీవనాధార ♦ భూతుఁడవయి
పలు తెఱంగుల నుతి కెక్కి ♦ ప్రబలి తీవు
కష్టములఁ బాపి నీలోనఁ ♦ గల్పుకొనుము
ఈశ్వరుఁడు భర్తనకు నైక్య ♦ మిచ్చినట్లు.

(అని సముద్రమునఁ బడఁబోవుచఱకు క్రూరుఁ డడ్డము వచ్చి)

తే. గీ. ఎచటికేఁగెదు విడువ —(అని వెనుకటిపద్యముఁ జదువును)

కమ—(హా! యని క్రిందఁబడును)

క్రూర—తరుణీ! నీ నక్కజిత్తులు నే నెఱుఁగనని తలఁచితివా? ఇటు చచ్చినదానివలె భూమిపైఁబడిన నిన్ను విడుతు ననుకొంటివా? నీవు నిశ్చయముగ చచ్చినను విడువను.

కమ—(నెమ్మదిగ లేచుచు) హా! నాథ! ఎచట నుంటివి? ఈ క్రూరుని బారిఁబడిన న న్నుద్ధరింప రావేమి?

క్రూర—చెలీ! నీ నూతననాథుఁ డిచటనె యున్నాఁడు మన్మథుఁడను క్రూరుని బారిఁబడి పరితపించుచున్న నీనాథు నుద్ధరింపరావేమి? (పట్టుకొనఁబోవును)

కమ—(తప్పించుకొని తనలో,) అయ్యో! ఇంకేమిసేయుదు? సముద్రమునఁబడి జీవములఁ బాయుదమనుకొన్నను దురదృష్టము సాగనీకున్నది. ఓ దయామయా! ఈశ్వరా! మఱిందేమిచేయనుంటివో కదా! ముందుగతి యెట్లున్నను ప్రస్తుత బంధవిముక్తికేమిదారి? (యోచించి, ప్రకాశముగ) అయ్యో! సదయా!

చ. గురువరుఁ డగ్రజుండు జన ♦ కుండు భయంబును దీర్చువాఁడునా
దరమున నోగిరం బిడిన ♦ దాతయుఁ దండ్రు లఁటం[illegible]ఁజెప్పుచుం

దఱుకద పెద్ద లింత మదిఁ ♦ దోఁపదె తల్లి నటంచుఁ దల్లికి
స్వైరమగువార లెవ్వ రిలఁ ♦ బాపముకాదె ? యముండు గాచునే ?

ఇంతకు మించిన మహాపాతక మింకొకటికలదా ? నీ వెఱుంగని ధర్మము లేమి కలవు ?

క్రూర—సఖీ ! నీ వనినట్లు నే నెఱుంగని ధర్మములు లేని మాట నిక్కవమే. నిష్కలుషమై నిర్మలమై నిరాక్షేపణమైయున్న నేఁ జెప్పు నుత్తమధర్మము నీబోటి మందబుద్ధులు నమ్మజాలరు. లోకమున సర్వజ్ఞులని సర్వశాస్త్రవిదులని యెన్నికఁగన్న వారలకే నీ యుత్తమమార్గ మించుకైనఁ బట్టుపడదు. అందుచే శ్రమచేసి వారెన్నిచదువులఁ జదివినను ఛాందసు లనఁబడుచున్నారని వేఱుగ నననేల ? నీవిపు డుపన్యసించిన గురుఁడు, అగ్రజుఁడు, కన్నతండ్రి, భయముదీర్చినవాఁడు, అన్నమిడిరక్షించినవాఁడు, నీయైదుగురుఁ దండ్రులని కదా నీ యభిప్రాయము ? ఎవ్వరో మతిపోయినవాండ్రు ప్రొద్దుపోక వ్రాసినపొత్తములు నీతిశాస్త్రములని, ధర్మశాస్త్రము లని త్రికరణశుద్ధిగా నమ్మి, తమదేహసౌఖ్యములఁ బాడుజేసికొనుచు, మనస్సు పిచ్చికుక్కవలెఁ పరుపిడుచున్నను పైకిమాత్రము నలుగురికిఁ గనుపించునట్లు డంబముగ మహాత్మునివలె నటించుమతిభ్రష్టుల మాటలను నమ్మి నీ విట్లను టెంతయవివేకము ? ఇది పోనిమ్ము. పాపముకాదా యంటివే ! పాపమన నేమి ? పుణ్యమన నేమి ? ఎన్నఁడైన నీకనుల గని యుంటివా ? లేక యెందైన నేఁ జూచినానని చెప్పఁగవిని యుంటివా ? యముండు గాచునా యనియునంటివి యముఁ డెవ్వఁడు ? పిచ్చిదానా ! ఇవియన్నియు దుర్భ్రమలు. జీవి నొకఁడు దండించువాఁడును, దయఁజూచువాఁడునుగూడ గలఁడా ? దేహమున్నంతవఱకు తన మనం బేదికోరునో దాని నేవిధముచేతనైన లభింపఁజేసికొని యనుభవించుటయే సుఖము. అది లభింపకుండుటయేకష్టము. కాని యింతకు మించిన విషయ మింకొకటి కలదా ? మఱియును నీవు చెప్పిననీతికి భిన్నముగవర్తించి సుఖించిన మహానుభావులు దేవతలలోను, మానవు

లలో నున్నట్లు నీవిపుడు నమ్ముకొనియున్న వెఱ్ఱిగ్రంథములలో ననేక కథలఁ జూపఁగలను. అందువిషయమై వేయేండ్లయిన విసుగులేక! యుపన్యసింపఁగలను. నిష్ప్రయోజనముగ నన్నలయింపక, మగువా కలసి మెలసి యుందము రమ్ము.

కమ—(తనలో) ఆహా! దైవమా! ఇది యెక్కడి యుపన్యాసము! ఎక్కడిమతము! నాకు గడువరాని యిక్కట్లఁ దెచ్చి పెట్టితివికదా! (ప్రకాశముగా) అయ్యా సర్వజ్ఞుఁడవు. నీ యుపన్యాసార్థమును గ్రహింప నాఁడుదానను నాకుఁ దరమగునా, తండ్రీ! (యోచించి) ఐనను నీ వనినట్లు నే నొక ప్రశ్న నడిగెద నుత్తర మిచ్చెదవా?

క్రూర—ఇప్పటి నాయుపన్యాసములోనేనా?

కమ—అవును.

క్రూర—నిరభ్యంతరముగ.

కమ—ముమ్మాటికి సత్యమేనా?

క్రూర—ముమ్మాటి కననేల, వేయిమాఱులకు సత్యమే.

కమ—(తనలో) పాపభీతి లేని యీక్రూరునకు సత్యాసత్యముల లక్ష్యమేమికలదు? అయిన నిట్లడిగిచూచెద (ప్రకాశముగ) అయ్యా! దేహ మున్నంతవఱకుఁ దనమనం బేది కోరునో, దాని నేవిధముచేత నైన లభింపఁజేసుకొని యనుభవించుటే సుఖమని యింతకుముందు పలికితివి?

క్రూర—అవును. అయిన నేమి?

కమ—క. నామది దేహసుఖముపై

నేమాత్రము లేదునీప ♦ ఱుని నంతకు లే

దేమిటికి నన్ను విడువుము

కోమలిమది లేని సుఖము ♦ గూడునె ధరలోన్.

దేహభ్రాంతినే మానుకొనిన నావలన నీ కేమి సౌఖ్యము గలుగును? నీకుఁ దగినరసికతగల యావని నింకెవ్వతెనైనఁ గోరుట యుక్తము.

క్రూర — చెలీ! మంచిప్రశ్నమును జేసితివి. నీకు నాపైని భ్రాంతిలేనిమాట వాస్తవమే యనుకొనుము—

మ. నిదురం జెందినఁ దెల్వి నుండినను నీ ♦ నేత్రంబె నాచిత్తమిం
పొదవ న్గోరుచునుండు నే యితర బిం♦బోష్ఠిం గనుగొన్న నా
మది కేమాత్రముఁ గోర్కి పుట్టదు నినుఁ♦మానంగ నెట్లొప్పుదున్
హృదయంబేతరుణి న్వరించెడినో యా♦యేణాక్షి యేరంభయా.

అట్లగుటఁజేసి నాకోర్కెను మాత్రము నే నెట్లు నెఱవేర్చుకొనకుందునో నీవే యోచింపుము.

కమ—(తనలో) అయ్యో! యీపాపాత్ముఁడు నన్నుసామాన్యముగ విడుచునట్లు తోఁపదు. హా! ప్రాణేశ్వరా! నీయర్ధాంగి కెట్టి కష్టములఁ జూపిపోతివి? (ప్రకాశముగా) అయ్యో! యీదీనురాలినేల నిర్బంధించెదవు? నీవునన్ను గోరుటకు నాయందంత యోగ్యత యే మున్నది?

ఆ. వె. వయసుపోయె సహజ ♦ వైఖరి క్షీణించె
మునలికంపు దేహ ♦ మున జనించె
పతివిహీన నగుట ♦ మతిచెడి మొద్దునై
కాళ్ళుఁ జాచియుంటిఁ ♦ గాటికొరకు.

ఇట్టి హీనురాలిం గోరికొన్న నీకేమి సౌఖ్యము! నీమోహంబు దీర్చుకొనుట కనేకులగు వ్యభిచారిణులు రసికురాండ్రని లోకమున నెన్నెకెక్కి యున్నవారలు. వారల గలసి సుఖింపుము. నీకు శరణుఁ జేసెద, నన్ను విడువుము.

క్రూర—ఓసీ! తెలివితక్కువదానా! ఇంతమాత్రముపాయము నే నెఱుఁగనా? నీవేల నిష్కారణముగ నాయానపడి యెదవ్రీటువినుము

తే. గీ. మునలికాని కురూపిణి ♦ మొద్దుగాని
యెవని కేది మనంబున ♦ కిష్టమగునొ
దానినే యప్సరస యని ♦ తలఁచు నరుఁడు
యెవనిపిచ్చి వానికిముద ♦ మీయకున్నె.

నీవు లోకమున కెట్లున్నను, నాకన్నులకు మాత్రము జగన్మోహినివలెఁ గన్పించుచున్నావుఁ అట్లగుటచే నిన్నువిడుచుట కలలోని వార్త. ఇంక నీవాదముమాని సాదరమున నన్నేలుకొనుము.

కమ—అయ్యా? నావంటిదిక్కుమాలిన దీనురాండ్రెవరిచేత నైనబాధింపఁబడుచున్నచో, నీబోంటి రాకుమారులు సదయహృదయు లై కనికరించి రక్షించెదరుగాని, యిట్లునిర్బంధింపఁజూచిన నా కిఁక గతియేది! ఒకవేళ నామనం బరయఁగోరి న న్నిట్లు పరీక్షింపదొరకొం టిరేమా! నాప్రాణమున్నంతవఱకు నే నా తుచ్ఛపుఁ గృత్యముల కియకొనను. అట్టివార్త లువినను. దయచేరక్షింపుము.

క్రూర—దయ యనునది నాజన్మమునకే లేదు. కావి నామ నంబరయుటకే నీవిట్లు భీష్మించియుందువు నాప్రాణ మున్నంతవఱకు నిన్ను నేనును విడువను.

కమ—(తనలో) ఇంకేమి యుపాయమున్నది? ఆహా! నాక ర్మము! ముందేమిగతి? ఏమి సేయుదు? ఎంతవినయమున వేఁడుకొ న్నను ఈదురాత్ముఁడు వినఁడు. నిక్కమముగ నామనోనిశ్చయ మెఱిఁ గించి చూచెద. (ప్రకాశముగ) అయ్యా! త్రికరణశుద్ధిగా, నీశ్వరసా క్షిగా, నామనోనిశ్చయ మెఱిఁగించెద వినుము.

తే. గీ. తనువు ముక్కముక్కలుగాఁగఁ దఱిగి నాదు
శిరము ఖడ్గముచేతఁ గోసిన నిఁ కట్టి
పాపమున కొప్ప దేహంబుఁ బాయనున్న
వారికి నుదధి మోఁకాలుబంటికాదె!

ఇంక న న్నెంతటి చిక్కులఁ బెట్టినను సహింతుఁగాని, యాపా పపుఁబని కియకొనను.

క్రూర—(తనలో) ఇంకను తారాశశాంకసేనుల నామిత్రులు బట్టి తేకయున్నారేమి? (కమలతో) ఓసి మూర్ఖురాలా! నీ కప్పటి నుండి కఱపినసీతి చవిటిభూమిలో నాటిన విత్తనముపగిది నిరర్థకమ య్యెను కదే! నే నాకృత్యమున కొప్పనని యేమో ధైర్యశాలినివలెఁ బల్కెదవు; ని న్నిపుడు బలాత్కరించిన నీయబ్బ యెవఁ డడ్డుపడఁగలఁ డనుకొంటివి?

కమ—(తనలో) హృదయమా? నీ విట్లు పంతపించి చేయున దేమికలదు? నీకడ్డుపడు దయాశాలు రెవ్వరు? ఎటులైన నిన్ను నీవే కాపాడుకొనవలయును. (ప్రకాశముగ) అయ్యా! నీ వనినట్లు నాకడ్డు

పడువారు లేకున్నను ప్రాణ మున్నంతవఱకు నాపాతివ్రత్యమ
లోపము రానీయను.

క్రూర—ఓసీ కులటా! నీ వెంత? నీప్రాణమెంత? నీపాతి
మెంత? నిన్నుఁ జెఱచుటెంత? కాని యట్లుఁ దలంపకుము.

సీ. ఎవరివృద్ధినిమిత్త ♦ మెంచుచుందురో నీమ
గండు నీ వేవేళ ♦ మెండుగాను
ఏవరి ముద్దులఁ జూచి ♦ యీవు నీవరుఁడు బ్రి
హ్మానందపడుదురో ♦ యనవరతము
ఎవరి ముచ్చటలు మీ ♦ రిరువురుఁ జెప్పుచు
సంతోసపడుదురో ♦ సంతతంబు
ఎవరి కాలునకు ము ♦ ♦ ల్లింతయునాట మీ
ప్రాణమే పోయిన ♦ భంగి నగునో
తే. గీ. అట్టి నీముద్దుబిడ్డల ♦ నడలి కన్ను
లార నీవు గన్గొనఁగ దు ♦ ర్గాంబ కెదుర
ఛాగముల గొంతుకలఁ గోయు ♦ చందమునను
కినసేనతారల తల ♦ లను నఱుకుదు.

అప్పటికైనఁ బ్రసన్నురాలవు కాకయుందువా?

కమ—హా! నా బిడ్డలారా! నామూలమున మీకుఁ దల
వ్రాసియుండెఁ గాఁబోలు.

[వీరపాలుఁడు శూరపాలుఁడు కనకతారలఁ బట్టుకొని ప్రవేశింతు

వీర-శూర—దేవరవారికి జయము. జయము.

క్రూర—ఏమి యింత యాలస్య మొనర్చితిరి ?

క్రూర—ఈ గుండగొయ్యలు సరిగా నడచిరా? మార్గ
మున నొకరినొకరు గాఁగిలించుకొనుచు నేడ్చుచుఁదల్లిదండ్రు
లఁదలచికొనుచుఁ జతికిలఁబడి యెంతకు వచ్చునట్లు గనుపింపకున్న
కొని వచ్చితిమి.

తారా-కన—(తల్లిపైఁబడి) హా జననీ!

కమ—హా! నాకుట్టిలారా! మీర లెందు కిచటి కేతెం
ఏపాపమెఱుఁగని పసిపాపలు మీ రేమిపగఁ జేసితిరి?

క్రూర—(వీరశూరులతో) ఏమది నిలువుగ్రుడ్లుబడి చూచుచున్నారు?

వీర-శూర—(కనక్తారలబట్టి లాగుచున్నారు.)

క్రూర—(కమలతో) ఏమే మొండిబండా! ఇంకనైన నీమంకుబుద్ధి విడిచెదవా లేదా ?

కమల—(తనలో) అయ్యో! పాపిదైవమా! ఇంకను నీపరీక్ష తుదముట్టలేదా?

క్రూర—పలుక వేమి?

కమల—(ఊరకుండును)

క్రూర—పలుకకుండుట యంగీకార సూచకమా?

కమ—పలుకుట కేమున్నది? మాటిమాటి కేమనగలను?

తే. గీ పతిని మంత్రిని సేనాధి ♦ పతినిఁ బట్టఁ
బెట్టుకొంటివి మముగూడఁ ♦ బట్టినాఁడ
వడుగ నేల చిక్కితిమి కా ♦ అడవి బోయ
వలను జిక్కిన పక్షుల ♦ వలెనె మేము.

నా పాతివ్రత్య భంగము తప్ప నన్నిటికిని నొప్పుకొనియే యున్నాను.

క్రూర—ఆ! అటులనా, మిత్రులారా! చూచెద రేమి (వీర శూరులు కనక్తారలను భూమిపైఁ బడవేయుచున్నారు)

తారా-కన—హా తల్లీ! రక్షింపుము రక్షింపుము.

క్రూర—(కత్తిజళిపించుచు కనక్తారల నఱుకబోవును.)

కమ—ఓదుష్టబుద్ధీ! ఏపాప మెఱుగనిపసిపాపల నేలచంపెదవు? పసిబిడ్డలు నీకేమి పగ జేసిరి? నీవిరోధిని నగు నన్నుఁ జంపుము. నా కుఱ్ఱల విడువుము. దీనురాలను దిక్కు లేనిదానను, అనపరాధినిని, నా మొఱాలించి నాబిడ్డల విడువుము. తండ్రీ! నీపాదములకు మ్రొక్కెదను. (మ్రొక్కును)

క్రూర—నీవు పెక్కు టక్కరు లొనరించినను విడువను. నా మనోరథం బీడేర్చెద ననుము. నిన్నన్నివిధములఁ గాకాడెద.

కమ—హా దుర్విధీ! ఏమిచేయుదు? ఎట్లు నాపాడుకన్నులతో జూతును? ఎట్లు భరింతు, నెవరివేడుదు? నెవరితో మొఱలిడుకొందు,

నెవరు విడిపింతురు? ఎట్లు నాజీవములఁ బాయుదును? ఓ మొండి ప్రాణములారా! మీరేల లేచిపోరు? ఓ దైవమా! నే భరింపజాల. నాకడుపు పగిలిపోవుచున్నది. హా నాబిడ్డలారా! నేఁ జచ్చిపోయి నాను. అయ్యో! ఎంతదిక్కుమాలినవారైతిరి! ఎట్టి కటికవానిచే జిక్కితిరి! ఓసింధురాజా! నీవైన నీపాపిని హరింపుము. (సముద్రమునఁ బడఁబోవును)

క్రూర—(చూచి) ఓసీ! నిన్ను సామాన్యముగ విడుతునను కొంటివా? (వీర శూరులతో) మిత్రులారా! మీరీమందుడుకుల ఘోరయరణ్యమున జంపిరండు.

వీర-శూర—చిత్తము (అనికనక్తారల నీడ్చుకొని పోవుదురు)

శివ—(సముద్రమున పడును.)

క్రూర—ఛీ! కులటా! ఇప్పటికి నాపీడ వదలినది పొమ్ము.

(నిష్క్రమించును)

(నలుగురు చేపలవాండ్రు ప్రవేశింతురు)

ఎల్లి—వదరకండ్రా! బేగి వలేయండ్రా!

[అందఱు సముద్రమున వలలువేసి మెల్లగ లాగుచు]

పుల్లి—అరే! నిన్న నీవలలోబడ్డ ఖాలగసాపేం జేశావురా?

నల్లి—నీకెందుకేశా దానిసంగతి! మార్కెట్లో అమ్మేశా.

మల్లి—అరే! అరే! రాండ్రా! రాండ్రా! వల సిరిగిపోతుం దిరా, వల సిరుగుతుండది రాండ్రా.

పుల్లి—ఏం బడ్డదశా?

నల్లి—(చూచి) ఔనశా! లాగండ్రా! లాగండ్రా! (అని అందఱు వలలు లాగుచు నిష్క్రమింతురు.)

శివ రంగము—అరణ్యము.

(వీరశూరులు కనక్తారలతో బ్రవేశము)

తార—ఆహా! ఈశ్వరా! ఎంతపనిఁ జేయుచున్నావు?

సీ. ఏపాప మెఱుఁగని ♦ పాపల కీచావుఁ
గల్పింపఁజేయుట ♦ ఘనమె నీకు?

కన—ఏకర్మ మెఱుఁగని ♦ యీ కసికందుల
నంత మొందించుట ♦ యశమె నీకు ?
తార—కుడియెడమలటన్న ♦ గోడెఱుఁగని మాకుఁ
దగనిదండన మీయఁ ♦ దగునె నీకు ?
కన—ఇహపరజ్ఞానంబు ♦ లెఱుఁగని మ మ్మిట్లు
చంపింపఁజూచుట ♦ చనునె నీకు ?
తార—తే. గీ. పాపులైనను శరణని ♦ పల్కినంతఁ
బ్రోతు వంట మున్నటుల నేల ♦ బ్రోవవయ్య ?
కన— ఆర్తరక్షణబిరుదాంక ♦ యడలుచున్న
దీనులము మమ్ము రక్షించు ♦ దేవదేవ.

తార—ఆహా! ఈనట్టడవిని మాకుదిక్కెవ్వరు ? ఓదైవమా! నీకైన దయరాకపోయెఁగదా! అనాథలకు నాథుఁడవనియు, ఆర్త రక్షకుఁడవనియు, జగత్పోషకుడవనియు, భక్తాభీష్టప్రదుఁడవనియుఁ బెద్దలూరక నిన్ను బొగడుచుందురు. నీకు భక్తులమై నీవే గతియని మొఱలిడుచున్న మాకీ శిరఃఖండనమే నీవొసగు దివ్యవరము లయ్యెగదా!

కన—అయ్యో! ఎక్కడిదైవము! యెక్కడిరక్షించుట!

చ. జననికి విన్నవించుటకు ♦ శత్రునిబారికి నాపె చిక్కి యె
ట్లయినను జావనుండె, నక ♦ టా! జనకుండుగతించె మున్నె! యీ
వనమునఁ జచ్చిపోవునటు ♦ వ్రాసెను దైవము గాన, దేవుఁడే
మననియకున్న వేఱొకరు ♦ మన్చి సుఖం బొనగూర్తురే భువిన్.

శూర—ఏమది! లేనిపోని వృథాప్రసంగములఁ గాలము గడుపుచు నడువకున్నారు? చూచిన వ్రేలెడు లేవు కాని నీకును మెట్ట వేదాంతోపన్యాసమే నటరా? (కనకుని ద్రోయును)

తార—(తమ్ముని గౌగిలించుకొని) హా! తమ్ముఁడా! మన కీనాఁటి కెన్నికష్టములు సంప్రాప్తించెను?

ఉ. ఎంతటిపాపకర్ములమొ ♦ యెంతటిహీనులమో మఱెంత దు
శ్చింతన గలువారలమొ ♦ చిన్నతనంబుననే మహాటవీ

ప్రాంతమునందా భాగములం ♦ బట్టి వధించెడిరీతి నక్కటా!
గొంతులు గోయనుండి రిక ♦ క్రూరులు దిక్కెవరోయితమ్ముడా!

కన—అక్కా! మనమిట్లు దుఃఖించుచున్న నాదరించువారెవ్వరు? ఈమరణముం దప్పించువారెవ్వరు? విధినిగడువ నెవరితరము?

చ. మన పినతండ్రి యిట్లు దయ ♦ మాని వధింపఁగఁ బంపెనంచు నీ
మనమున దూరబోకు కొర ♦ మాలిన జన్మము లెత్తిదుఃఖభా
జనులము గాకయుండుటకుఁ ♦ బంపఁగ నక్కృపఁ బంపె, గాకపో
యిన తనువెప్డు శాశ్వతమె ♦ యెన్నటికైనను చావు తప్పునే.

తార—అయ్యో! తమ్ముఁడా! మరణమునకన్న మించినకష్టమింకొకటి కలదా! యెన్నడు చచ్చునది తెలియకుండ నీ లోకులకు దైవవిధిచే నకస్మాత్తుగ నెపుడో యేసమయమునో మృత్యువు హరించుచుండబట్టి చచ్చెడివఱ కేది తెలియక, ధైర్యములో నుందురు కాని, మనకుఁబలెనే చావు నేఁడేనని తెలిసిన నెవ్వరైన ధైర్యముతో నుండగలరా?

తే. గీ. అమరులైనను మౌనీంద్రు ♦ లైనఁగాని
సర్వమును మిథ్యయనిపలుకు ♦ జనులుగాని
మృత్యువన గుండె లవిసి వి ♦ స్మృతులుగారె
ప్రాణములె తీపి యని జను ♦ ల్వలుక వినవా.

శూర—ఒరే! అన్నా! ఈ దడుకు లేక నడచునట్లు గపించుటలేదు. పోసి, పాపముని చూచినకొలఁది నొకయుద్యైన వేయుఁ లేదు. నీ వీయిద్దరిని గదలకుండఁ బట్టుము. నేనొక్క వ్రేటున వీ తలలు నఱికెదను ఇంకెంతదవ్వేగిన నేమిలాభము?

తార, కన—హా! అక్కా! హా! తమ్ముఁడా (అని యొక నొకరు కౌఁగిలించుకొని మూర్ఛిల్లుదురు)

వీర—అరే! ఇట్లడలుచున్న పసిపాపల జంపుటకు నీకుఁ జేతులెట్లు రానేర్చురా?

శూర—వీరిని జంపుటకు మనకు చేతులు రాకున్నను మ యజమానునకు మనలఁ జంపుటకుఁ జేతులు రాకుండునా?

వీర—తనప్రాణముపోయినను నొకజీవమును రక్షించు ధర్మము కదా!

శూర—అంతటి ధర్మగుణము నాకు లేదు. అంతటి యోపికయు లేదు. నాప్రాణములు నాకుఁ జక్కఁగకున్నఁ దీపినుమా!

వీర—నీప్రాణములు నీ కెట్లు తీపియో, పాప మా పసిబిడ్డలకు మాత్రము తీపి లేక చేదా?

శూర—నిజమే కాని యజమానియాజ్ఞ యనుల్లంఘనీయము కదా!

వీర—యజమానియాజ్ఞ నెరవేర్పకున్న నేమి భయము?

శూర—భయమేమి? నిష్కారణముగ మన ప్రాణములఁ దీయును.

వీర—ఎట్లు?

శూర—తెలిసినచో.

వీర—ఎట్లు తెలియును?

శూర—అమ్మయ్యో! అసుర్మార్గుఁ డెటులైనఁ దెలిసికొనఁ గలఁడు. తెలసినవాఁడు మనపెండ్లి కాక మానఁడు.

వీర—వెఱ్ఱివాఁడా. నీ వాభయ మెంతమాత్ర ముంచికొనవకుము. సర్వవిధముల నే యుక్తులఁ బన్ని కూరిరునివలని భయము లేకుండునట్లు కాపాడెద. నీవుమాత్రము నేఁ జెప్పినట్లొప్పు కొనుచుండవలయు.

శూర—(తనలో) ఇతఁ డుపాయశాలి. వీనిమాట వినకున్న ముందెన్నటికైన నన్ను మోసముచేయక తప్పఁడు. [ప్రకాశముగ] వీరపాలా! ఈవిషయమున నెన్నటికైన నీదే భారముసుమీ!

వీర—ఆఁ! అటు లనుము. నీయరికాలునకుముల్లువాటిన నన్నడుగుము. (కనకుతో) అబ్బాయీ! కనకసేనా! మిమ్ముఁ జంపుటకు మా మనస్సు లొప్పుటలేదు. చంపిన మా కేమిలాభమును లేదు. మిమ్మిచ్చట విడిచిపోయెదము. మీ పినతండ్రి కనిపెట్టకుండ సంచరింపఁగలరా?

కన—అయ్యో! దయదలఁచి విడిచిన నట్లే మెలంగెదము.

వీర—అటులైన మీయాభరణములును, వస్త్రములును మా కొసంగుఁడు. అవి మీయొద్ద నున్నచో నెవరైన గుర్తింతురు. ఈవస్త్రములు మీరు ధరింపుఁడు (వేరువస్త్రము లిచ్చును.)

తార-కన—మంచిది. (అటులఁ జేయుదురు)

శూర—(తనలోఁ) ఔరా! ఏమి వీనియుపాయము! అడవిలో నైతము వీనికి ధనార్జనము తప్పినది కాదు. పెట్టిపుట్టినాఁడురా! (ప్రకాశముగ) అన్నా! నా కిందులో భాగ మీయవా!

వీర—నే నన్యాయము చేయను. క్రమముగఁ బంచుకొందము రమ్ము. (పోవుదురు)

తార—(భయమున నటునిటుఁ జూచుచు) తమ్ముఁడా! పోదము రమ్ము. (కొంతనడచి) హా! ఎంతకష్ట మెంతకష్టము!

కన—అక్కా! యేమి?

తార—

చ. అడుగిడ నేర; నొక్కఁడను ♦ కైనను కల్గఁగనోవ నయ్యయో
గడగడమంచు మే న్వడఁకెఁ ♦ గన్నులు కానఁగరావు, దార్ఢ్యమా
యుడిగెఁ, గ్రమంబుగామిగుల ♦ నూర్పులు హెచ్చెను ప్రాణ మేఁగెడిన్
దడయక యిన్నినీరములఁ ♦ ద్రావఁగఁ జేయఁగదోయి తమ్ముఁడా!

కన—అయ్యో! యిచ్చట జలము లెచ్చటఁ గానరావు? ఏమి చేయుదునక్కా? ఈ కుజచ్ఛాయను కొంత విశ్రమించి సేద దీర్చుకొనుము.

తార—(కూర్చుండి తల్లిం దలఁచుకొని) అయ్యో!

మ. జననీ! క్రూరునిబారి కోరువక నీ ♦ జన్మంబుఁ జాలింపగా
వనధిం గూలెదనంచుఁ బోయితివి య ♦ వ్వారాశిలోఁగూలి నీ
తనువు న్బాసితివా? మఱెవ్వరిని యో ♦ తల్లీయటంచందు మిం
కనుమమ్మెవ్వరు ప్రేమఁ జూచెదరు మోఁకక్కుందికక్కు లేరొక్కరున్

తల్లీ! యీ క్రూరునిచేఁ జిక్కి పరితపించుచుండియు, మమ్ముఁ జంపునేమోయని విలపించితివి. నీకష్టములే నీకు భరింపశక్యము లేకుండఁగ పాపపుబిడ్డలము నీకు మేము పుట్టుటచే మాకడగండ్లుచూడఁగ లేక యెంతయో దుఃఖించితివి. నీకష్టములఁ బాపి సుఖపెట్టుటకు బదులుగా మావలన నీకుఁ గొంతదుఃఖమే చేకూరె.

కన—(తనలో) అక్కటా! నాతల్లికష్టములఁదలంచి భరించుట దుష్కరము; నే సుతుఁడనై యామె కష్టములఁ దీర్చుటకు బదులుగా దుఃఖమే యొసఁగూర్చితిఁ గదా!

తే. గీ. నామపుట్టు విసీ వృథా, ♦ నామబ్రతుకు
తుచ్ఛమింక బ్రతుకుట బహు ♦ దుఃఖకరము
పౌరుషము కల్గువానిదే ♦ బ్రతుకుగాక
పౌరుషవిహీనునిది యొక ♦ బ్రతుకు బ్రతుకె!

తార—తమ్ముడా! నాలుక యెండి యీడ్చుకొని పోవుచున్నది దేహస్మృతి తప్పుచున్నది. ఇంకనే నిలువజాల. హా! సైరింపజాల. కొంచెముజలముగొనివచ్చి నా ప్రాణముల నిల్పుము. (మూర్ఛిల్లును)

కన—(సంభ్రమమున) అమ్మో! మాయప్ప దప్పిచే మూర్ఛ నొందెనే. జల మెచ్చట దొరకును! ఏమి చేయుదును. ఈ యడవి నెచటనైన దొరకునేమో వెదకి తెచ్చెదను. (పోవును.)

[బూచిగాడను దొంగమేటి ప్రవేశము]

బూచి—అయ్యొయో చిరకాలమునుండి నేజేసిన తపుసంత బూడిదెలో గల్పాల్సివచ్చిందిగందా. నాబుద్ధిబలంశాత, వంటిమదం శాత కూరయ్యదొరగారి దయశాత, యింతకాలందాక దార్లుగొట్టి కన్నాలేసి సానైకర్లు నేను బతుకుతావుండంగాని, లేకమోతే వోడి తరం? మాయలు కాటికెలు, మందులుంటాయని లోకంలో అనుకుంటారుగాని యెక్కడి మాయలు, యెక్కడి క్కాటికెలు వోడైన పోలీ సోడు సూసినాడా మాయలు మంతరాలు కాటికెలు గీటికెలు మంట గల్పాల్సిందే. అందుకోసమే కాలికామ్మోర్ని పత్తేచ్చం జేసుకుంటేఅన్నిదాల కుడిబుజమై రచ్చిత్తదనుకోని మొన్నాల్నించో కొలుత్తావుంటే మొన్న అమ్మోరుదేవత కన్నిపిల్లను బలిత్తె నీకు పత్తేచ్చం అయితానని నాకల్లోసెప్పిందికాని మొన్నటినంది పిల్లకోసం తిరిగీ తిరిగీ సుడిమడితింగదా, (తారనుజూచి) వోరదీ! వోరా పండుకున్నది యేందీచిత్రం! (దగ్గరకుబోయి చూచుచుండును)

తార—(కదలును)

బూచి—(డాగును)

తార—(నెమ్మదిగలేచి) తమ్ముఁడా! దాహము! దాహము! ఇస్ అబ్బా! నేనిలువజాల. [నలుదిక్కులుచూచి] తమ్ముడా! కనక సేనా! యెటులేగితివి? [నెమ్మదిగలేచి నిలచి వెదకి] సోదరా! సోదరా! కనకా! అయ్యో! యెచ్చటనులేఁడే! నేనేమిచేయుదు! హా దైవమా! తలిదండ్రులఁబాపినదేకాక, మాయిద్దఱినిఁగూడ వేఱుచేసితివా! హా! ప్రియసోదరా! యిట్లిడుమల బడుచు దేహస్మృతిలేనినన్ను విడిచి పోవుటకు నీకెట్లు కాళ్లాడె.

సీ. అధికానురాగుల ♦ మైయున్న నను఻ బాసి
తమ్ముఁడా! యిట్లేగఁ ♦ దగున నీకు
ఎపుడైన గడియ న ♦ న్నెడబాసి యుంటివే
తమ్ముఁడా! యిట్లేగఁ ♦ దగున నీకు
తలిదండ్రులంబాసి ♦ విలపించుననుడించి
తమ్ముఁడా! యిట్లేగఁ ♦ దగునె నీకు
ఆఁడుదానిం గదు ♦ నబలనడవివీడి
తమ్ముఁడా! యిట్లేగఁ ♦ దగునె నీకు
తే. గీ. క్రూరసేనుని భీతిచేఁ ♦ గుంది నీ వా
కండ వాధారమనియుండ ♦ గడకు నీవు
నరిగితే వ్యాఘ్రభయముచే ♦ నకట! చెట్టు
కొమ్మ బట్టఁగ నదియునుఁ ♦ గూలినట్లు.

అయ్యో! నాకేమి యీవికలత? నాతమ్ముని గుణము నేనెఱుఁగనిదా! నన్ను విడనాడిపోవునా! దాహమున నుదకము దెమ్మని నే మూర్ఛనొంద నీరములకొఱ కేగియుండును. లేకున్న నింకెట కేగఁగలఁడు! (అనికొంతధైర్యమున గూరుచుండును.)

బూచి—(తనలో) యేందిది! దీనికి తమ్ముడోఁడు! దగ్గరకెల్లి అడుగుదాం (సమీపించి) నువ్వోరు?

తార—అయ్యా! నేనొక దిక్కుమాలిన దానను.

బూచి—అట్టంటే నాకు తెల్దు. బాగసెప్పు.

తార—అయ్యా! నేను గతిలేనిదానను.

బూచి—యేంది! మీఅయ్యోరు?

తార—(తనలో) వీఁడెవఁడు? వీని యాకృతిజూడ భయంకరముగనున్నదే! ఎవఁడో యీ యడవిని వసించు మోటుమానిసి యని తలంచెదను, అయ్యో! వీఁడు నన్నేమి సేయునోగదా!

బూచి—యేం మాటాడ్డా?

తార—(తనలో) వీనితో నిజము చెప్పితినేని నాకేమైన మేలు చేయఁగలఁడు. [ప్రకాశముగ] అయ్యా! మాయయ్య యుదయసేన మహారాజు.

బూచి—ఆఁ—ఆఁ—యేందీ! కూరయ్యదొరగారి అన్న బిడ్డవా సెప్పా!



తార—ఔను నాయనా!

బూచి—అయితె నువ్విక్కడి కెందుకొచ్చినా?

తార—మా పినతండ్రియగు క్రూరసేనుఁడు మా తండ్రిని, సేనానిని, మంత్రులఁ జంపి మమ్మిటకుఁ జంపఁబంపె. ఆ కింకరులు దయదలఁచి విడిచిపోయిరి, నే నడువలేక దాహబాధచే మూర్ఛనొంద నా తమ్ముఁడు జలము దెచ్చుట కేగి యింతవఱకు రాఁడయ్యె. తండ్రీ! నా సోదరుఁడు నీకు గనుపించినాఁడా?

బూచి—అట్ట సెప్పా! నే నోరో అనుకున్నా! నువ్వేనా! అట్టయితే పోయికాడి కొచ్చిన కుందేలాలె సిక్కితివి. మా దొరగారి పగోడిబిడ్డా కావున నిన్ను కాలికామ్మోరికి బలిచ్చేత్తా రా. (పట్టుకొనఁ బోవును)

తార—హా తమ్ముఁడా!

బూచి—తమ్ముఁడు లేఁడు గిమ్ముఁడు లేఁడు. (అని యెత్తుక పోవును.)

ద్వితీయాంకము.

సంపూర్ణము.



శ్రీ

# కనకతారానాటకము

## తృతీయాంకము

### 1వ రంగము, అడవి.

(బూచిగాడు, నలుగురు దొంగలు)

బూచి—అరే! యిన్నారంట్రా! మనకూరయ్య దొరగారి పెతాపం.

1 దొం—యేందిరా?

బూచి—యదవనాగన్నలారా! యేం కనుక్కున్నార్రా? యెప్పుడు తెల్లక్కువ పుటకలేనామె. అరే యిన్నాల్నించే సెప్తం డాంగందా యేగుదీటమె యెటికిలేదామె; కోవరం గూసోవటం రాదామె. దార్లుగొట్టమంటె అసలే తెల్దామె. కన్నాలెయ్యమంటె కేటిలేదామె. యిగ పచ్చపుతనమేంజేత్తార్రా? పూట కొక్కొక్కడు సూడేస్సేర్లబియ్యంతిని దున్నల్లాగా వుంటమేగాని యేమాత్రం తెలియిలేకనేపామె యిట్టా సంసారిపచ్చంగుంటె యెట్టా బతుకుతార్రా!

2 దొం—మాకందటికి పెద్దోడా, తెలిసినోడా, తెలికలోడా నువ్వుండంగ మాకేం తక్కువిశా. యేదొచ్చినా నువ్వే వుంటెయిగా.

3 దొం—అరే! యిందాక కూరయ్యదొరగారి పెతాపం యిన్నార్రా అంటివే. యేదో సెప్పవేంరా?

4 దొం—నిజమేనిశా! మర్సిపోయిన సెప్పు సెప్పు.

బూచి—యేందంటే కూరయ్యదొరగారు తనన్న యినయమై

మనతోవోనాదు సెప్పలేదంట్రా, అట్టాగే మంతిరిని, సేనపతిని తనన్నను సంపి తనన్న బిడ్డను కొడుకునుగూడ సంపమని యిద్దరి పోసుకోలోల్ల నంపినాడంట. ఆపోసుకోలోల్లుసంపలేక మనడియిలో యిడిసిపెట్టి పోయినారంట. పిల్లగాదు నీల్ల కెల్లిండంట. పిల్లకూసుం డది. నేను కాలికామ్మోరికి బలియ్యటానికి పిల్లిగాని కన్నెపిల్లకోసం తిరుగుతా, అక్కడికెల్లేలిక్క నాకంటోబడ్డది. అప్పుడే దాన్నెత్తుకొచ్చి మన కైదుకానాలో యేసినా. బూదారమైనం కేందిరా ఆ-బేత్తారం బేత్తారన్నాడు. దాన్ని కాలికామ్మోరికి బలిచ్చేత్తా, అప్పుడు కాలి కామ్మోరు వరాలిత్తాది. కూరయ్యదొరగారుగూడ బామతులిత్తడు. మొద్దుగాడ్లల్లారా? అందులో దొక్కకాసైన మీకిత్తానను కున్నా రేమా? యియ్యను.

1దొం—నీదయయుంటేసాల్లేశా. మాకుమాత్తరంయింతకూడు మెడ్తావుందు; యేబామతులొచ్చినా నువ్వేతీసుకో. మాకెందుకురా ?

బూచి—నరేకాని కూరయ్యదొరగారు సేసిందిబాగొప్పరవని. ముందింకనేక పంగతులుజరగనుండై, మీరు మాత్తరం మనడియిలో వోడుమోతున్నా తచ్చునమేవొచ్చినాకు సెప్పాలె. లేకమోతే మీ బుఱ్ఱలీత్తా గాడుల్దాల్లా. (అందరు నిష్క్రమింతురు)

[విజయసేనుఁడు మతిమంతుఁడు కొంతసైన్యము ప్రవేశము]

విజ—మంత్రీ! మతిమంతా !

సీ. విఫలఘారోన్నతో ♦ర్వీజంబులేకాని
సఫలవామనవృక్ష♦సమితిలేదు
ముండ్లుఁగల్గిన కుట్ర ♦పొదలెగాని సుఖంబు
నిచ్చు చల్లని పొద♦రిండ్లు లేవు
మదగంధపుష్ప స ♦ మాజమేకాని సు
వాసనాయుత సుమ♦ప్రతతి లేదు
కరిసింహ శార్దూల ♦ కిరితతియేకాని
సాధుమృగశుకాది♦చయము లేదు
తే. గీ. క్రౌర్యదుష్ట నివాసయో♦గ్యంబెకాని
యనఘ తాపసవాసయో♦గ్యంబుకాదు
సజ్జనులులేక క్రూరులౌ ♦ జనములుండు

గ్రామమట్టులు దోఁచు నీ ♦ కాననంబు.

మతి—నిశ్చయము. కాని యటు చూడుఁడు.

మ. ఉపకారంబొనరించి లోకమున కెంతో మేలు చింతించి యె
ట్లో పగదీరఁగ గ్రుంకెఁబూషుఁడవితా ♦ హమ్మంచుఁ గ్రూరాంధ
కారపుఁదండమ్ము జగమంతం జేచదాడఁగ ♦ రౌద్రంబుతో నెవ్వ
రుపకారిన్ హరియింతు రంచు జను లౌ ♦ రా వేఁచఁగా నిత్తఱిన్.

విజ—ఔనిప్పుడు ప్రొద్దు గ్రుంకినది; సంభాషణాతత్పరతచే నేనదిగమనింపలేదు నేఁటికీయడవినిమన సైన్యమాగునట్లాజ్ఞాపింపుము.

మతి—చిత్తము. (సేనలతో) సైనికులార! నేటి కిందు విశ్రమింపుఁడు.

సేనలు—చిత్తము. (విశ్రమింతురు)

విజ—(మంత్రిసహితముగఁ గూర్చుండి) అమాత్యవరా! లోకమున నెట్టి దుర్మార్గు లున్నారు?

మతి—భూమి మోయలేక ము న్నిట్టివారికొఱకే కాఁబోలు బ్రహ్మతో మొఱపెట్టినది.

బూచి—(ప్రవేశించి) యీల్లోరు? కాసేపుంటే అదే తెల్సుద్ది. (పోఁగుదు.)

విజ—మంత్రిసత్తమా!

సీ. తన కగ్రజుండును ♦ ధర్మాత్ముఁడైనట్టి
యన్ననుంజంపువాఁ ♦ డవనిఁ గలఁడె
జననిసమానయు ♦ సాధ్వీమతల్లియా
వదినెఁ బట్టఁగలట్టి ♦ పందగలఁడె
పతియాజ్ఞ చొప్పున ♦ వర్తించు సేనాధి
పతిని మంత్రిం జంపు ♦ పాపిగలఁడె
పసిపాపలని తలం ♦ పక దయారహితుఁడై
శిశుహత్యఁ జేసెడి ♦ చెనటిగలఁడె

తే. గీ. అకట! విని భరింపఁగరాని ♦ యత్యఘంబు
చేయ మనసెటు లొప్పె ఛీ ♦ ఛీ దురాత్ముఁ
డధముఁ డవినీతుఁ డగునట్టి ♦ యా నృశంసు
శిరము ధరణిపై దొర్లంగ ♦ నఱుకవలయు.

మతి—నటుకుటకాదు; నలచినను కోపముపోదు.

బూచి—(తనలో) వో స్నీడు నటికేది?

విజ—అకటా! పరమసాధ్వీరత్నము నేమి భంగము చేసెనో? సువిచారపరుఁడగు వృద్ధకంచుకి యీవార్త నింతశీఘ్రముగ మనకం పుట యాతని బుద్ధిబాహుళ్యము ప్రశంసనీయము. తత్క్షణమేపోయి క్రూరుని రూపుమాపి, కమలాదేవి చెఱ విడిపింప వేగిరపడి యేగెడి నాకీ యంధకార మొక కారాగారమై దారి సాగనీక పోయెగదా!

మతి—(తనలో) అమంగళము ప్రతిహతమగుగాక! మహారా జేగునది యుద్ధమునకు, శత్రుఁడతిదుర్మార్గుఁడు; ముందేమి కీడుమూఁ డునోకదా! (ప్రకాశముగ) దేవరవా రరిభంజనసంభ్రమముచే నశుభ మగు వాక్యములఁ బలుకుచున్నారు. ఇంత త్వరపడి పోయినను యీ రేయి యుద్ధమగునా? ఎటులైన నుదయమగు వరకిఁ బోకయుందుమా?

విజ—మంచిది.

బూచి—(తనలో) ఊఁ హుఁ-నేననుకుండా నేవుండా. నువ్వెల్లి మాదొరగార్ని నటికేత్తావ్. యిక్కడనిన్ను నటికేత్తే నీకుదిక్కెక్కడ్రా వుండు. నేనింటికెల్లి మచ్చుమందులు తీసుకొచ్చి నిన్ను కైదులో యేసేత్తా. (పోవును)

మతి—ఆహా! యేమి యీ హాయి!

కం. హిమగిరి ప్రేమంపు కిశో
రము లలితము వారినిధిత • రంగానుజముల్
కమనీయ మధికచేత
ప్రమదముగ మ్మందమంద • పవనమువీచెన్.

విజ—ఆహా, మలయమారుతసమాన మగు హాయియుఁ గ్రూరసేన కృతసమాన మగు లోకబాధయును నెచ్చట గానరావు కదా.

మతి—అదిగో! విరహిణీజనమానస సంతాపకరుండగు సుధా కరుండు తనరాక లోకమునకెఱుకఁ జేయుటకెత్తిన శ్వేతకేతన మను నట్లు ప్రాగ్దిశ నమృతకరుని రాకఁదెల్పుచున్న యీ తేజముఁ గను గొంటిరా!

విజ—అమృతకరుఁ డనెదవేమి! అన్నితీరినవారల కమృతకరుఁడు

గాని యపేక్షాతత్పరుల కమృతకరుఁడా? ఇన్ని యేల! అతఁడు గురుద్రోహి; అతని మొగముఁ జూడరాదు. ఇపుడు కనుఁగొనుము. జగములనాక్రమించుచుఁ దనకరములను మచ్చుమందుల పాంథుల విస్మృతుల జేయుచు నెదురులేక యేతెంచుచున్నాఁడు.

మతి—(తనలో) జగదానందకరుఁడగు శీతకిరణుని నిందించుచున్నారేమి? ఔను ఒకవిధమగు పాంథులకానందపరుఁడు; మఱియొకవిధమగు పాంథులకు వేదనాకరుఁడు. అందుచే నీచంద్రుఁడు దూషణ భూషణయోగ్యుఁడు. (ప్రకాశముగ) ప్రస్తుతము మనకు సుఖకరుడగు చంద్రుఁడు ఏలనో దేవరవారి యాగ్రహమునకుఁ బాత్రుఁడగుచున్నాఁడు.

విజ—ఏలనో యనెదవేమి?

ఉ. అగ్రజుఁ డస్తమించెనని • యాత్మనుబొంగుచుఁ దా భుజార్గళో
దగ్రత సర్వలోకముల • దర్పముజూపుచు నాక్రమించి య
త్యుగ్రముతో వియోగుల బ • హు ప్రకరంబుల బాధఁబెట్టు వీఁ
డాగ్రహపాత్రుడౌను జను • లందఱికి న్మనకేల కాఁడొకో.

మతి—(తనలో) ఇప్పుడీ దూషణము తాను వియోగమునను౦డుటచేతనా! కాదు. క్రూరసేనుని విషయమై మనమున బాదుకొనియున్న క్రోధము. ఒక్క క్రోధమేగాదు విరహక్రోధములు రెండును వీరిమనమున నిప్పుడు కాపురముఁ జేయుచున్నవి. (ప్రకాశముగ) మనమేతెంచిన పని వేరు; ఇప్పుడు చేయుచున్న ప్రసంగము వేరు. ఎట్లో ఈరాతిరిగడిపి యుదయమగుసరికి క్రూరునితో నాలముఁ బ్రారభింపవలయుఁ నింక నదురింతము.

విజ—ఇప్పుడేమనుకున్న నేమున్నది; నేఁ డలసియుందురు. అందఱు జాగ్రతగ శయనింపుఁడు నేనును నిద్రించెదను. [శయనింతురు]

బూచి—[ప్రవేశించి మందుజల్లి విజయసేను నెత్తుకొనిపోవును]

## 2 వ రంగము

[చేఁపలవాని గృహము—మల్లిగాఁడు, కమలాదేవి ప్రవేశము]

మల్లి—(కమలతో) నిన్న నీల్లల్లో సావకుండ, పాపమని వొడ్డుకుతీసి బతికిచ్చినందుకా నే నొప్పుకొనననేది? యేరుదాటి తెప్ప తగలబెట్టే మచ్చురా గుండదే నిన్నిడవను. నిన్ను పెల్లిసేసుకోక తప్పను [అని పట్టఁబోవును]

కమ—(తనలో) అయ్యో! దైవమా! నాబ్రతు కెంతతుచ్ఛమైనది ఏమిసేతు?

ఉ. క్రూరునిబారిఁ దప్పి మదిఁ గొంకక సంద్రమునందుఁ బడ్డ న
వ్వారిధి హీనజాలక తనన్ బ్రాణముఁ దీయక యొడ్డు కెక్కఁగాఁ
జేరిచె వీవి జాలమునఁ జిక్కులు వీఁ డిటు పెట్టుచుండె హా
నేరక చేయుదోష మొకఁ డిందుఁ గాశికిఁ బోవఁ దీరునే.

పూర్వజన్మమున నేవరి కిట్టి కష్టముల గుడిపితినో నా కిప్పు డనుభవమునకు వచ్చుచున్నవి. (మల్లిగానితో) తండ్రీ! నన్నేలనిర్బంధించెదవు? నేఁ జావకుండ నా యాపదం బాపి రక్షించినావు నీకు నేఁ గూఁతును. నన్నంటిన నీకు పాపము వచ్చును.

మల్లి—యేంది! పానం దక్కించినోఁడు తండా? నిజమేనా?

కమ—ఆపదఁ బాపి రక్షించినవాఁడు తండ్రితో సమానుఁ డని నీతి విదులు పలుకుదురు. నీవు నాయాపదఁ బాపి రక్షించినావు. తండ్రి వెట్లు కావు?

మల్లి—యేం దీ సిత్తరం! అట్టయితే యెవడిపెల్లామైన నీల్లల్లోపడితే దానిమొగుడు దా న్నొడ్డుకుతీత్తే దాని కాడు తండేనా?

కమ—(తనలో) ఆహా! ఎచటి కేగినను యీ విరుద్ధమగు ప్రశ్నలే తటస్థించుచుండె. (ప్రకాశముగ) అయ్యా! అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన సతి ప్రాణములు సదా పతి స్వాధీనములేకాని యన్యములు కావు. అట్లగుటచే నీళ్ళఁబడినను; ఒడ్డున నున్నను, నింట నున్నను, జంటనున్నను సతిప్రాణములఁ బతి కాపాడుచుండుటధర్మమే రావున సతీపతులయెడఁగాక తదితరులయెడఁగాక తదితరులయెడనెట్టి వారికైనఁ దండ్రిభావము తప్పదు.

మల్లి—వోసబ్బ! నీయగ్గి గిగ్గిగొడవ నాకు తెల్దు. నిన్ను కెల్లాడకమోతే నే బతకను,

కమ—(తనలో) అయ్యో! దైవమా నీ పాపిష్ఠిపరీక్షకింకను తుదముట్టలేదుగా! ఇన్ని కష్టములచే నన్నలయించుటకన్న నొక్క సారి నా ప్రాణముల నెత్తుకొనిపోరాదా? ఈ మొండి నేల బ్రతికించి నిర్బంధించెదవు. (ప్రకాశముగ) అయ్యా! నీవు చావనేల? ఈ సంతాప మేల? మఱల నన్ను సముద్రమునందుఁ బడవైచి కాని యింకే యుపాయముచేతగాని నా ప్రాణములఁ దీసిసుఖం బుండుము.

మల్లి—అమ్మో! బాబో! నిన్ను సంపినాక నే నుండెందుకు? యిదంతెందుకు సేత్తవు కాని నన్ను పెల్లిసేసుకుంటివా కాపలకు కానంమీద పెత్తనం నీకిత్తా, యింటో పెత్తనం నీకే యిచ్చేత్తా రోజు వన్నం వండటానికి నీసేతిమీదుగా గింజలు కొట్టో పోస్సే టట్లు సేత్తా. ఇదంతెందుకు నాపానం నీపాదాలకాడ మెడ్తా. నామాటిను. లేకమోతే నిన్నింక నేక సిక్కు లెడతా. సూసుకో కబర్దారు.

లచ్చి—(ప్రవేశించి మగనితో) అరే. యేందిరా నీ జిమ్మడ? దాని సేయట్టుకోని సైగలు సేత్తుండా. ఏమనుకున్నారా. నీబుఱ్ఱ పగలుగొడ్తావుండు. (కొట్టబోవును)

మల్లి—వోసీ నీపొగరు గొయ్య సేసుకొన్న మొగన్నిగొడ్తవంటే?

లచ్చి—కొడ్తానా, నిన్ను పాతిమెడ్తానా?

మల్లి—నే నేంజేసినానని కొడ్తావే?

లచ్చి—యిదోతిరా! యిప్పుడు నువ్వు సేసేపనేందిరా! నాకు తెల్దనుకున్నావురా?

మల్లి—కోపపడకే. నీ కంతా సెపుతాగాని—

లచ్చి—యేం సెపుతావురా నీ మొగాని కగ్గిమెట్ట?

మల్లి—నీకాళ్ళు మొక్కుతా కాసేపుండవే!

లచ్చి—యేం సెపుతావో సెప్పురా. అబద్దం సెప్పితే నీ బుఱ్ఱ కటకటకొరుకుతా. యే మనుకున్నావో.

మల్లి—మన దేవరసత్తెంగసెప్తుతా యినే. సేశాపలకొల్లి నీల్ల లోవతెకాల కిది వల్లో బడ్డది. వలొడ్డుకు దీశాలికి సరక్కన మెరుపు మెరిసినట్టనిపిచ్చి నాకల్లు మూసకపోయిన్నై. అప్పుడు నాతో నొచ్చిన మన నల్లన్న పుల్లన్న, యల్లన్నల్తో తగువాడి వాల్ల కియ్యకుండ యింటికి తీసుకొచ్చి పెల్లి సేసుకొని దొరసాన్లా గుందామంటే వుడసంటంది. యెంత బతిమాల్నా పెల్లి సేసుకోనంటంది నువ్వొచ్చేయాలకి గూడ అదేమాటంటుంది. (సంతోషముతో) సూడు దాని మొకం సూడు. పూదిచ్చిన దేవరకుండమీన కంచుడాలె గుండరం గుండది. యిలాటిదాన్ని పెల్లిసేసుకోక యిడిసిమెట్టి నే నెట్టా బ్రతుకుతానే?

లచ్చి—వోరి నీయందాన కగ్గిమెట్ట? నీ కింకో పెల్లాం గావాలెనంట్రా? బంగారమాలె మా మేనమామ కొడుకు యంకన బావకు మాఅయ్య నన్నిత్తానంటె దెయ్యమాలె మెయ్యొచ్చి ఆ మనుం సిట్లగొట్టి నీపాడు మొగానికి నన్ను గట్టెనే. నేనేం బాగ్గెం జుర్రుకుంటున్నారా? నీయేడుపుకు నే నొక్కదాన్ని సాలనంటావ్? అది నాకన్న సక్కందంట్రా!

మల్లి—సక్కందో గిక్కందోకాని దాన్ని సూపినప్పటినుండి నా కజ్జెత్తినట్టు, పెద్దదెయ్యం బట్టినట్టు, కారం రాసినట్టు, వొల్లంత మంటలు, సీమలు పారాడినట్టు గులగులమని నాకేం తోసదు. నీకాల్లు మొక్కత. నువ్వయినసెప్పి దాన్ని నాకు పెల్లి సెయ్యవే.

లచ్చి— అట్టానా! అప్పటిసంది సెప్పయేంరా? నీకు పెద్దదయ్యం పట్టిందంట్రా! నీకు పెల్లిసెయ్యాలేనంట్రా! నీ దెయ్యాన్ని వదలిత్తె నీ పెల్లి అయినట్టేలే. (అని చీపురుతో గొట్టుచుండ నననన అనుచు కమల నొకగదిలో వైచి బీగము వేసి పోవును)

మల్లి—(నిష్క్రమించగనే)

లచ్చి—(బీగము పగులగొట్టి) రాయే! దెయ్యంలాగ మావెంటబడ్డా.

కమ—(యీవలికి వచ్చును)

లచ్చి—సెప్పకుండ తప్పిచ్చుకొని మాయిరుగునపొరుగున

మావూళ్లో వుండకుండ లగెత్తు. యెల్లక పల్లొత్తివా నిన్ను శాపను సీల్సి సట్టుసీల్సి యాల్లాడగడతా, కబరదారు. (త్రోయును.)

కమా—(నిష్క్రమించును)

[3-వ రంగము: అరణ్యము, కనకసేనుఁడు ప్రవేశము]

కన—హా! యేమి యీ విపరీతము! నే ముందేగిన త్రోవ కన్పించుటలేదు. ఇంతవఱకు మా యప్పజాడ చిక్కుటలేదు. ఏమి సేయుదు?

ఉ. ఆఁకలి దప్పి బాధల నె ♦ హాయని నిల్వఁగలేక నేత్రముల్
చీఁకటి గ్రమ్మ మూర్ఛిలినఁ ♦ జెచ్చెర నీరము నేఁగ, నీరమూ
లేక యెపోయె, నప్పయును ♦ లేదు వనమ్మునన, గోరుచుట్టుపై
రోకటిపోటు చందము నెఱుంగఁగనయ్యె నిఁకెట్లు లక్కటా.

హా! దైవమా! యెంతటి దురవస్థపాలు చేసితివి. అయ్యో! సోదరీ ఎందుంటివి? యే మైతివి?

సీ. దప్పిచే నాలుకఁ ♦ దడిపోడిలేక దా
హము దాహమని యెంత ♦ యడలినావొ
స్మృతిలేక పడిన ♦ స్థితిలోన నే మృగ
మ్ముల పొట్టలోఁ బడి ♦ పోయినావొ
త్వరలో జలమ్ము నో ♦ దరుఁడు తేలే దని
యాగలే కెటకైన ♦ నేగినావొ
నిర్దయాత్ముఁడు వని ♦ నిను డించి పోయినాఁ
డని భీతి నెటకైన ♦ నరిగినావొ
తే. గీ. అకట కష్టముల్ బడలేన ♦ టంచు బల్మిఁ
బ్రాణములఁ దీసికొని యొడల్ ♦ వాసినావొ
అప్ప నా కేమిగతిఁ జూపి ♦ యరిగినావొ
యెందుమోదు గతిం జేసి ♦ యేగినావొ.

అయ్యో! అక్కా! నీ దప్పిఁదీర్పఁ జేతగాని నన్నెంత దూరితివో! నీ మనంబున నేమేమి తలంచితివో! నీ జాడ నా కెట్లు తెలియును? తెలియకున్న నెట్లు భరింతు? నెట్లు బ్రతుకుదు? నిపు డేమి

సేయుదును? దైవమా! నాకేమిగతి! ఛీ! నాయట్టి యదృష్టహీనుఁ డీ లోకమున నింకొకఁడు కలఁడా!

చ. జనకుని మ్రింగి తల్లి నొక ♦ శత్రుఁడు పట్టిన ప్రాణభీతి నే
మనకయ చూచుచుండి గహ ♦ నాంతరమందున సర్ప దాహమం
చన నది తీర్పలేక యిపు ♦ డాపెను సైతము గోలుపోయి యే
మని మననేర్తుఁ బాపిణియుత ♦ మైనశపాబుఁబోలి దైవమా.

ఆహా! ఈశ్వరా! చతుర్దశభువనములలో నాయట్టి హీనుఁడొక బుట్టగలఁడా! నీచే నిర్మింపఁబడు జీవకోటు లనంతములు కదా! ఇన్ని జీవములు చేయనిపగ నీకు నేనే చేసితినా? ఒకవేళఁ జేసితినేకానిమ్ము ఒక్కసారి నన్నగ్నిలోఁ గాల్చి భస్మముచేయరాదా? ఏదోయొక ప్రవాహమున ముంచి చంపరాదా? దీనుఁడనైన నన్నిట్లులనిర్బంధించి వేధించెదవు. నీవేమో దయామయుఁడవని యందఱందురు కాని లోకానుభవమునుబట్టి చూడ నీయట్టి కఠినుఁ డింకొకఁడు లేఁడని తోఁచెడిని.

సీ. నీవె మాపతియను ♦ నిజమైన దాసుల
కెపుడు కష్టములనే ♦ యిత్తువుగద
నీవె రక్షకుఁడని ♦ నిను నమ్ము భక్తులఁ
బలురోగములకుఁ బా ♦ ల్పరతువుగద
నీవె మాకన్నిఁట ♦ నేత వనెడివారి
నొంటిజేసియుచూచు ♦ చుందువుగద
నీవె మాదిక్కను ♦ నిశ్చలమతులను
క్షితిని దరిద్రులఁ ♦ జేతువుగద
తే. గీ. నీవె మాగతియని సదా ♦ నిన్ను నమ్ము
జనముల బరీక్ష చేతువు ♦ చచ్చుదాఁక
చచ్చిపోయెడివాని లో ♦ చనములందు
ప్రేళ్ళబెట్టి త్రిప్పెడువాని ♦ విధముఁగట!

హృదయమా, యింకేల పరితపించెదవు జాతస్యమరణం ధ్రువ మనునట్లెన్నటికైనఁ జావుతప్పునా? నాతల్లి మొదలగువారిఁగోల్పోయి మొండివలె బ్రతికి యేమి బావుకొనుటకు? ఈపాషాణమున తల వ్రియ్యలు చేసికొని ప్రాణముల విడిచెదను. (అని నడచును.)

(ఋషులు కొందఱెదురుగ వత్తురు)

ఋష—కుమారా! యేల దుఃఖించెదవు? నీవెవరు?

కన—మహాత్ములారా! వందనములు.

ఋష—మేలగుగాక! ఎచటికేగెదవు?

కన—మహానుభావులారా!

ఉ. దీనుఁడ నెందు జూచినను ♦ దిక్కొకయింతయు లేదు పోకు చీ
కానవమందుఁ గ్రుమ్మఱుచుఁ ♦ గాయమువాయుట కేయుపాయము
న్నానకయుంటి నన్నుఁ గృపఁ ♦ గాంచి వధింపుఁడటొప్పకున్న మీ
లో ననుఁ గల్పుకొండకను ♦ లోహము హేమముఁ జేయుచాడ్పునన్.

ఋషు—కుమారా! నీచరిత్రమంతయు మాకు దివ్యదృష్టివలన బోధపడినది. ఇఁక వగవకుము. (ఒకదారి చూపుచు) ఈ మార్గమునఁ బొమ్ము. కొలదికాలములో నీకన్నివిధముల మేలు చేకూరును, మాకు గాలాతీత మగుచున్నది. పోవుచున్నాము. దుఃఖింపకుము. (పోదురు)

కన—ఆహా! ఏమి యీయాశ్చర్యము! నాకేమి? మేలుచేకూరుటెట్లు? అయ్యో! యెక్కడి యడియాసలు?

ఉ. అందఱిఁ బాపుకొంటి నట ♦ లైనను చావఁగనుంటిఁ గోర్కెలో
డెందమునుండి జాఱఁగను ♦ డించి తపించుచునుంటి మానులో
మందిక నేమొ మేలగును ♦ పొమ్మనిరీ తెర వేటి భ్రాంతి హా
యందవి ప్రమానిపందులకు ♦ నానవహించిన లాభ మేమగున్.

(యోచించి) ఐనను మహాత్ముల చరిత్రము లత్యద్భుతములవ వినమే. వారిచిత్తానుసార మార్గముననే పోయి చూచెదగాక!

(నిష్క్రమించును)

[కమలాదేవి ప్రవేశము]

కమ—ఆహా! ఏట్లెటో యా పుణ్యాత్మురాలివలన విడిపింపఁబడి భయావృతచిత్తనగుటచే దారి తెలియక నీ భీకరారణ్యంబుఁ జేరితి. ఇటనుండి యెచటికేగుదు? ఎచటికేగినను నాకేయాప్తులు న్నారు? ఉండిరనుకున్నను పోయి యేమి మేలనుభవింపఁగలను? ఇఁక నాబ్రతుకే నిరర్థకము.

చ. కనులను నన్నుఁ బెట్టికొని ♦ కాచెడు నావిభుఁడస్తమించె ముం
దునయిన వృద్ధినొందెడి సు ♦ తుండుఁ గుమారిక చచ్చియుండు రే
ను సటులఁ జచ్చిపోవునటు ♦ నోమమిఁ గష్టము లొందుచుండిఁ జి
క్కనివగు శాఖలం దునుమ ♦ గా నిలుచుండిన మొద్దుకైవడిన్.

(తారాకనకులఁదలఁచికొని) హా! బిడ్డలారా! మిమ్ముఁదలఁచికొన్న నాకడుపు పగిలిపోవుచున్నది. విరోధమున సమాత్యచమూపతులసహితముగ నగ్రజుని బరిమార్చి, అంతకును దనకోప మువశమింపకున్న నన్నుఁగూడ దనఖడ్గమున కెరచేయుఁగాక! ఏపాపమెఱుఁగని పసిపాపలు మీ రాక్రూరున కేమిపగఁ జేసితిరి? అయ్యో! నా ముద్దుకూనలారా! గ్రామదేవిముందుఁ గోసెడి మేఁకపిల్లలఁబలె మీ తలలఁ గోసెదనని, యా దుష్టుఁ డపుడు పలికియుండె అట్లు మిమ్ము నేలఁబడవైచి యాభయంకరాకారులగు కింకరులు మిమ్ముఁ గదలనీక పట్టుకొని కఱకఱ తలల నఱకునప్పు డెంత తల్లడిల్లితిరో, యెంత యెలుఁగెత్తి యేడ్చితిరో, యెంతపాపపుజన్మమెత్తితిమని వాపోయితిరో మీతండ్రి నెంతపిలిచితిరో, యా పాపాత్మురాలి గర్భమున నేందుకు జన్మించితిమని పాపిష్ఠురాలనగు నన్నెంత దూఱితిరో బిడ్డలారా! మిమ్ము నఱికినప్పు డెంత గిజగిజఁ దన్నుకొని జీవముల విడిచితిరో. ఆహా! పాపిదైవమా! నీ క్రూర పరీక్షల కెరమై ఱాయివలె నేనుండ నా పసిబిడ్డల కిట్టి దుర్మరణముఁ జేకూర్చుటకు నీ కేమిపగఁ జేసిరి? నన్ను భగభగమని మండునగ్నిలో మాడ్చరాదా! సలసలమని క్రాగు తైలములో ముంచరాదా! నాశరీరము ముక్కముక్కలుగ ఖండించి చంపరాదా! అయ్యో! నేనెంత పాపాత్మురాలనో! యెంత ద్రోహురాలనో! యెంతక్రూరకర్మురాలనో! యేమిసేతు? నెట్లీ పరితాపముపశమింతు, నెట్లు భరింతు. నెట్లు జీవింతు? హా! కనకతారలారా!

[ఇంతలో బెబ్బులియొకటి వచ్చి పైఁబడఁబోవ కమలాదేవి యటునిటు పరువెత్తుచుండ, రాంజట్టి యను నొకశూరుఁడు పులితోన ప్రవేశించి పిస్తోలుతో పులిని గొట్టి చంపును.]

రాంజ—(తనలో) ఈబెబ్బులి యీమెచేయు రోదనధ్వనివిని పొంచుచు వచ్చుచున్న నేఁ గని దీని నంతమొందించితి లేకున్నఁ బాప మీపె యెవరో యిప్పటికి పులి కాహారమై యుండును. ఈమె యెవరు!

(పరికించి) ఎవరో సుకుమారివలెఁ గన్పించుచున్నది. ఒంటిగ నిట్లేమ్చుట కేమి హేతువై యుండును ?

కన—(తనలో) ఆహా ! నా కష్టములఁ బాపను,తనక దీర్చుకొనను వచ్చిన యీ శార్దూలముం ద్రుంచిన యీతఁ ఇంక నా కెన్ని యిడుములు కలుగనున్నవియో కదా ! ఇతఁడ కామింపఁడుకదా ! ఛీ ! యాఁడుపుట్టు వెంత చెడ్డది ! ఎన్ని లని యోర్చుచుందును ?

రాం—అమ్మా ! నీ వెవరు ? ఇచట నొంటిగ నెందు నీ వగపునకుఁ గతమేమి ?

కన—(తనలో) ఈతఁ డెవరోకాని సధర్మునివలెఁ చున్నాఁడు. [ప్రకాశముగ] తండ్రీ ! నే నొక నిర్భాగ్యురాలన వశమున నా నాధుఁడును, నాత్మజులును గతించిరి. ఏమియుఁ దారితప్పి యీమహారణ్యముఁ జేరితి అయ్యా ! నన్ను భక్షించి కష్టములఁ బాప నేతెంచిన యీ బెబ్బులిం జంపి యింకను గష్టములఁ బాప నేతెంచిన యీ బెబ్బులిం జంపి యింకను నన్నుఁ జంపి పుణ్యముఁ గట్టుకొనుము.

రాం—అమ్మా ! నీ వెవరవో పూజ్యురాలవుగాఁ గ చున్నావు. వైరాగ్యముతో నీ విచటఁ జావనేల ? నాకిద్దఱు లున్నారు. ఆ కుత్రులును ముద్దుల మాటఁగట్టు చుందురు. దిక యొక్కతె వీయఁడవినిఁ బొక్కనేటికి ? నాయింట నాపుత్రిలత తోమనమునఁ గాలముఁ గడుపుచుండుము. నిన్ను నాబిడ్డవలెఁ కొందును నీవు నాకేమి పనులు చేయనక్కఱలేదు. నిన్నుఁ జ బాపము నాకేమీ కడుజాలి పుట్టుచున్నది. నీమనంబున న తలంపకుము. నీ కెందును లోపము రానీను. పూర్వకర్మానుసా గలిగెడు కష్టసుఖములకు దుఃఖానందములతోఁ బనిలేదు. అ నీవు భయపడక నా వెంటరమ్ము.

కన—(తనలో) ఇది నిక్కవమేమై యుండునా! దురా నడత లేమియుఁ గన్పించుట లేదు. అయిన నేఁ జేయున దేమి క

ప్రాణములఁ దీసికొందమన్నను సమ్మతింపఁడు దయామయుఁడైనచో యిట్టి నన్ను విడిచిపోనుగూడ సమ్మతింపఁడు. నా ప్రారబ్ధమెట్లున్నదో యట్లు జరుగక తప్పదు. (ప్రకాశముగ) అయ్యా! నీవింత నమ్మకముగఁ జెప్పుటచే వచ్చెదను.

రాంజ—రమ్మా, సందేహింపకుము. (నిష్క్రమించును)

## 4 వ రంగము.

[విజయసేనుని కోటసింహద్వారము, భటుఁడు ప్రవేశము]

భటు—అయ్యయ్యో! మేమెంత దురదృష్టవంతులము. ధర్మాధర్మవిచక్షణాధురీణుండును. భూతదయార్ద్రచిత్తుండును, శౌర్యధైర్య సాహస పరాక్రమోపేతుండు నైన మా విజయసేన మహారాజుగారి మిత్రుఁడగు నుదయసేన మహారాజు కుటుంబ కష్టముల విని వారికి మేలొనర్పఁ గ్రూరసేనునిపైకి దాడివెడలి యొక యరణ్యమునప్రొద్దుగ్రుంకుటచే; సేనల సహితముగ శయనింప నుదయమగుసరికి మహారాజుగారొక్కరు మాత్రమే కనుపించరయ్యె; ఆ యడవినంతయుఁ జెట్టు గుట్ట పరికించినను నేమాత్రము జాడ చిక్కదయ్యె. ఈ ఘోర వార్త విని, మా మహారాజ్ఞిగారాహార నిద్రలులేక నేలఁబడి విలపించుచున్నది. ఆ కష్టముఁ గన్నులఁజూచిన నెట్టి కఠినులైనఁ గటకట బడికన్నీరు విడువకుందురా! ఏకష్టము లెట్లున్నను ప్రస్తుతము రాజులేమింజేసి రాజ్య మరాజకమై ప్రజ లన్యాయవర్తను లగుచుండిరి కదా! ఆ కారణముననే యీ సింహద్వారమున దుర్గనుప్రతిష్ఠించి, కవాటము వేసి యెవరిచేతనీకవాటము తెరవఁబడునోవారి నీ రాజ్యమున కభిషేకింతమని యమాత్య చమూపతులాదిగాఁగల వారాలోచించి యట్లొనరించి నన్నిచటఁ గాఁపుండునట్లు నియమించిరి. ఇన్ని దినములు గతించినను, నొకఁడైన నీ తలుపుఁ దెరచినవాఁడు గాఁడు. సకలదేశములయందు వేలకొలఁది చారులు వెదకినను మా భూపతి జాడ యించుకైనఁ జిక్కుటలేదు. ఇది మా దురదృష్టము. మా దేశమున కింక రాజు దొరకఁడేమోగదా! (అని తిరుగుచుండును)

కన—(ప్రవేశించి) ఋషులయానతి నింతవఱకే తెంచితిఁ గాని మేలు మాత్రమేమి చేకూరలేదు.

భటు—ఇతఁడెవరో ద్వారాభిముఖుఁడై వచ్చుచున్నట్లున్నదే!

కన—ఇచట నొక ద్వారము మూయఁబడియున్నది. తెరచి లోనికేగి కొంచెము విశ్రమించెదను. (తెరచును)

భటు—(సంతోషముతో) ఆహా! మేము నేటికి ధన్యులము. (కనకుతో) అయ్యా! మీరెవరు?

కన—నే నొక రాజకుమారుఁడను.

భటు—సరే! యిఁక మాకడగండ్లు కడముట్టినవి. అయ్యా! ఇటు ఇటు.

కన—ఇదెవరికోట?

భటు—ముందన్నియు నివేదించెదను దయచేయుఁడు.

(నిష్క్రమించును)

తృతీయాంకము సంపూర్ణము.

# భాగ్యరేఖ

గ్రంథకర్త:-కోపల్లి వేంకటరమణారావుగారు.

పెద్దమనుష్యులమని, ధర్మకార్యనిర్వాహణదీక్షా పరతంత్రులమని పెద్దపేర్లు బెట్టుకొని మహిళాసమాజములకు, ననాథశరణాలయములకు శెక్రిటరీలగానుండి సమాజములోనొక బాలికను రహస్యముగాఁ బ్రేమించుచు, దుర్మార్గానువర్తియైన కృష్ణశాస్త్రి యనునొక అనాథాశ్రమపు శెక్రటరీచరిత్ర. ఆశెక్రిటరీ ప్రేమించిన బాలికనే యొక ఆశ్రమపువిద్యార్థి ప్రేమించి యెన్నియో యాటంకములు రాఁగ, వానిని సాధించి శెక్రటరీయత్యాచారములను బాలకవర్గమువారికిఁ బట్టి యిచ్చి కార్యసాఫల్యము చేసుకొన్న మీనాపత్రిభాకరముల ప్రణయగాథ. పాలవాళ్ళను, పెరుగువాళ్లను, మోసముచేసి వారి పెట్టుబడులవలన కాఫీహోటళ్ళు పెట్టి యాఖరికి దివాలాతీసి తరుయింపుడుఁ గ్రైలచేతఁ బరాభవమునొంది కళ్ళుపోయి మోక్షసాధనమునకై పరమేశ్వరుని ధ్యానించు యొకకాఫీహోటలు కీపరుకట్టుకథ యంతర్నాటకముగ హాస్యరసప్రధానముగు ఘట్టము. ఈనాటకము శ్రీజయపురము మహారాజావారి సమక్షమునను, సాలూరి కవిమండలివారి సమక్షమునను ప్రదర్శింపఁబడి పారితోషకములను యోగ్యతాపత్రములను పొంది సాంఘికనాటకముల సభాతాంబూలము పుచ్చుకొనినది. ఆంధ్రభాషాయోషామణి వడుమునకొక రవ్వలవడ్డాణమువంటి సాంఘికనాటకము.

వెల 1—0—0



ఓం

# కనకతారా నాటకము

## చతుర్థాంకము

### 1-వ రంగము.

(నలుగురు దొంగలు ప్రవేశము)

1 దొం — అరే మనకంటే మించినోళ్లీలోకంలో వోరున్నార్రా?

2 దొం — మనకంటె మించినోఁ డింక పుట్టిరాల్సిందే.

3 దొం — మనకంటె మించినోడు లోకంలో లేఁడని పేల్తూండారుగందా మనబూశన్నింటే బుఱ్ఱల్తీయద్రా!

4 దొం — మనబూశన్నకు పెబువైన కూరయ్యదొరగార్ని మరిసిపోయినార్రా.

1 దొం — అరే తెల్తక్కు వెదవల్లారా! ఆరుండమట్టె మనకంటె మించినోడు లేఁడని సెప్పాల్సొచ్చింది. లేకపోతే మన్నడిగిందోదిరా?

2 దొం — అవునిరా! యింక మనకోఁ డడ్డం?

3 దొం — మనకడ్డం రావటానికి బెమ్మదేవుఁడి తరమా?

4 దొం — యెక్కడి బెమ్మిరా! ఆ డబ్బ శాతగూడ గాదు.

1 దొం — అరే మనం పెట్టిపుట్టినాంరా. మన బూశన్నకి కూరయ్య దొరగారికి ఆవుసు శానా లుండాల్సని పాటబాడుకొంటా ఆడదాంరాంఁడ్రా?

బూచి—[ప్రవేశించి కోపముతో] మొద్దుగాడ్డుల్లాలా! పొట్ట ల్నిండా మూఁడేసి సిప్పలకూడు మెక్కి కన్ను మిన్నెరికలేక తిరుగు తుండాట్రా. ఆనాఁడు కూరయ్యదొరగారిమీది కిద్దానికెల్లే రాజోర్ని పట్టుకొచ్చి కైదులోయేసి, కాయిలి బాగుండమని సెప్పితే మీాకేం కాయిలుండాట్రా?

1 దొం—మన దేవరతోడ్రా? కాయిలి కాత్తానేవుండాంరా.

బూచి—యేంకాత్తుండాట్రా? అన్నిసూపిత్తానురా [వెన్నునఁ జఱచును]

బూచి—ఓరి దున్నల్లాలా! ఆఁడు కైదుకానా పగలగొట్టుకొ నెల్లిండురా. (నిష్క్రమించునుఁ)

1 దొం—ఆ డిప్పు డందుల్నేవుండ్రా, అబ్బా! యెన్నుపగిలే టట్టు గొడితియేంరా!

2 దొం—అరె! యిప్పుడు సూసొత్తింగదరా! యింతలోనే యెట్లాపగలొట్టుకో నెల్లిండురా!

3 దొం—మన కూరయ్యదొరగారింటె బుఱ్ఱలిత్తియకతప్పదులే, జావండిగాడ్డుల్లాల.

4 దొం—అరే; అప్పటినంది మనకు మించినోఁ డోఁడు లేఁడ నిపేల్తిరే? యీఁడు మనందర్ని మింగేటోడుగాఁడ్రా! బూశన్నకొ డికో యెల్లెనేంరా?

విజ—(ప్రవేశించి)

శా. ఓరోరీఖలచిత్తులార యిటు గ ♦ ర్వోన్మత్తులై క్రూరులై
చోరత్వంబున సంచరింపుచు జన ♦ క్షోభంబుఁ గైకొంచు ను
న్నారా? నాదు భుజాబలంబున మిము ♦ న్నాశంబు నొందింతు సీ
తారాముం డసురాళి మాపినటు మ ♦ త్ఖడ్గంబుచే నిత్తఱిన్.

[దొంగలు నిష్క్రమింతురు.]

విజ—ఛీ! హీనులారా! పాటిపోయితిరా పొందు ఎట్లోయుపా యముచేఁ గారాగృహమునుండి యీవలఁబడితి, గాని, యీ దుష్టుఁ డగు చోరుఁడు నావలెనే యింక నెన్నిప్రాణులఁ గష్టపెట్టు చున్నాఁడో; వీనిని బరిమార్చి లోకమునకు మే లొనర్చెదను.

(ముందునకుజూచి) అదుగో నాచోరుఁ డెవ్వఁడో యతిదుఃఖిత యగు నొకకన్యం బట్టుకొని యిటులే వచ్చుచున్నాఁడు. చాటుననుండి కని పెట్టెదను. (డాఁగును)

బూచి—(తారనుబట్టుకొని ప్రవేశించి తనలో) ఆడుతప్పిచ్చి కెల్లినట్టిదిగూడాల్తే నానోట మన్నడాల్సిందే. యీయాల బేత్తారంబే గెల్లి దేవరకు బలిచ్చేత్తా (తారతో) అబ్బసివులు గింగుదు మనేటట్టు గీ, గీ, యని యేమేడుత్తదిరా, వూకోస్ వూకో.

తార—అయ్యో! దైవమా! యిపుడు నాకెవరు దిక్కు! హా! నాప్రియసోదరా!

చ. జలములఁదెచ్చి నమ్మఁగనఁ ♦ జాలక యేక్రియ జేరినాఁడొ? నేఁ
బలుకకయున్నఁగాఁ అడవి ♦ పాలయి క్రుమ్మఱు చెంతకుందిలో?
యలసి నిరాశఁబూని యెట ♦ నైన మృతింగనినావొ? యయ్యయో
యిల నెవరైన బుణ్యమున ♦ కేగినఁ బాపము రాకయుందునే.

ఆహా! తమ్ముఁడా! మొదటినుండియు మనము—

సీ. ఒక కండ చెదరి మే ♦ నొకటిమాత్రమె గాక
యవనిపై నుద్భవ ♦ మందినాము
ఒకతల్లి ప్రేమచే ♦ నొసగెడి చనుఁబాలు
ద్రావుచుఁ బెద్దవా ♦ రమయినాము
ఒక యీడుగల్గు బా ♦ లకులఁ గూడియు నాట
లాడుచు నతిముద ♦ మందినాము
ఒక పొత్తులోఁ దిను ♦ చొకచోట శయనించు
నొకటిగా నెడఁబాయ ♦ కుండినాము

తే. గీ. చివర కొకచోటనే మృతిం ♦ జెందనుండి
యిప్పు డెడఁబాయగానైతి ♦ మీవు నేను
నుదరమందు నున్నప్పటి ♦ నుండికలసి
యున్న జీవదేహంబుల ♦ తెన్నువఁ గటా.

బూచి—యేడు-యేడువ్, ఆకరేదుపు. ఇంకానేసాగినంక నీ యేడుపనుగుద్దిలే.

తార—ఆహా! ఈశ్వరా! నీపరీక్ష కిది తుది కాఁబోలు. నీ వింక నెట్టికష్టములపాలు సేసినను, మర్కటకిశోరంబు చందంబున విడువక నిన్ను స్మరింపుచు నాజీవములఁ బాసెదను.

బూచి—ఇంకేమన్నేదుత్తవేమొ యేదువ్. అయిందా, ఒఁగరా (పోదురు)

విజ—[తనలో] ఎక్కడికిఁపోవునో నేనును పోయెదను.

[పోవును]

2-వ రంగము కాళికాలయము.

బూచిగాఁడు తారను బట్టుకొని వచ్చును.

విజయసేనుఁడు వెనుకప్రక్కవచ్చి డాఁగును.

బూచి—పో. అమ్మోర్ని పూజిచ్చు పో.

తార—(ఊరకుండును)

బూచి—పూజిచ్చొ (కత్తిజూపుచు) ఇదుగో! కబరదార్ పూజిచ్చొ? డండమైన పెడ్తావా లేదా?

తార—(గడగడ వడకుచు) తండ్రీ! నన్ను నిష్కారణముగఁ జంపిన నీకేమి లాభము! ఎంతధైర్యము దెచ్చుకొనెద మనుకొన్నను తళతళమని మెఱయు వాడిఖడ్గంబుఁ జేతఁబట్టి లయకాలునివలె నటుక జూచుచు నెదురుగ నీవు నిలిచియున్న నాధైర్యము నిలువకున్నది. అయ్యా! నీయింటిముందు బానిసనై పడియుండెదను. నన్నుఁ జంపకుము. నీపాదములకు మ్రొక్కెదను. (మ్రొక్కును)

బూచి—లెగులెగు, నాకాళ్లకెందుకు మొక్కుతా, అమ్మోరికి మొక్కు.

తార—(తనలో) అయ్యో! పాపివిధీ! నన్నీ కాళి కాహారార్థమే సృజియించితివా? ఓజగజ్జననీ! కాళికాంబా!

చ. కరుణ నమస్తలోకముల ♦ గల్పనఁ జేసినదానవౌటచే
నరయఁగ సర్వజీవములు ♦ నాత్మజులేకద నీకు? నేను నం
దరివలెఁ గానటంచు పయి ♦ దప్పి ననుం దినఁ జూచుచుంటి వి
ధ్ధరణిని నెట్టిచోట్లయగు ♦ తల్లియు సంతతి మ్రింగఁజూచునే!

బూచి—యేం మొద్దులాగ నిల్చున్నా?

తార—(వినయభయములతో) తండ్రీ! నాయొడలు గడగడ వడఁకుచున్నది. నోట మాట రాకున్నది నాలుక తడఁబడుచున్నది. నన్ను మన్నించి చంపక విడువుము.

బూచి—బాగుంది, ని న్నిడవటానికి తెచ్చినా ననుకున్నావు. (పెండ్రికలు పట్టుకొని) అమ్మోరికి, మొక్కు (అని వంచును)

తార—(భయముగ) హా! ఈశ్వరా! నారాయణా! దేవేంద్రాది దిక్పాలులారా! ఆర్తరక్షకులారా!

విజ—(పిస్తోలుతోఁ గొట్టి దొంగను చంపును.)

తార—(విజయసేనుఁ జూచి) నాయార్తి నాలించి నన్ను రక్షింప నేతెంచిన నాపాలి వేల్పా! వందనము లొనర్చుచున్నాను.

విజ—చిరంజీవివి వగుదువు గాక. అమ్మాయీ! నీ వెవరు?

తార—అయ్యా! పోనున్న నాప్రాణములనొసంగి రక్షించిన ని న్నెంత కొనియాడుదును? మీవంటి యార్తరక్షకు లీ లోకమున నైన గలరా?

విజ—(తనలో) ఈమె న న్నొక వేల్పుగాఁ దలంచుచున్నట్లున్నది! (తారతో) అమ్మాయీ! నేను వేల్పును గాను ఒక మనుష్యమాత్రుఁడనే.

తార—అయ్యా! నీవు మనుష్యుఁడవైన నేమి, ప్రాణము లిచ్చి రక్షించినావు. నాకు దేవునికంటె నెక్కువవాఁడవు.

తే. గీ. ఎట్టి వేల్పైనఁ బ్రోవ రా ♦ వే యటంచు
వేఁడుకొనిన రక్షింపని ♦ వేలు పేల?
భూతదయచేతఁ బ్రాణులఁ ♦ బ్రోచు నరుఁడు
వేల్పుకన్న నెక్కువ యన ♦ వినమె ధరను.

విజ—ఓహో! ఈ కన్యకామణి యెంత నీతివిదురాలు! ఈమె కంఠధ్వనియు, యాకృతిపోలికయు నెన్నఁడో చూచినట్లు స్ఫురించుచున్నది (తారతో అమ్మాయీ, నీపే రేమి? నీతండ్రి యెవరు?

తార—(దుఃఖముతో) అయ్యా! నాతండ్రియేయున్న నాకీ గతి యేల? నాపేరు మీరడిగిన ఫలమును నేఁ జెప్పినఫలమును లేదు.

విజ—(తనలో) ఏమదీ! యిట్లనుచున్నది! (తారతో) అమ్మా! నీ తల్లియున్నదా?

తార—ఉన్నదో, లేదో తెలియదు.

విజ—(తనలో) ఏమియుఁ దోచదు. [తారతో] అమ్మా! నీ పేరేమి దయచేసి చెప్పుమా?

తార—దిగంతవిస్తారితయశోవిశాలుండగు నుదయసేనభూపతి పుత్రిని; కూ్రరకర్మిణిని. తార యను దానను?

విజ—ఆహా! ఉదయసేనమహారాజా! నేఁటికి నీ యాత్మజ కిట్టి విపత్తు చేకూరినది.

తార—(ఆశ్చర్యపడును.)

విజ—[తారనుదగ్గరకుఁ దీసికొని] అయ్యో! బిడ్డా! నీవెంతటి దుర్దశపాలైతివి? వన్నన్యథా తలంపకుము; నేను మీతండ్రి మిత్రుడను, విజయసేనుఁడను.

తార—అయ్యో! తండ్రీ! భయావృతచిత్త నగుటచే, మిమ్మిప్పటినుండి గుర్తింపకున్న నాతప్పు క్షమింపుఁడు.

విజ—అమ్మా! మిమ్మందఱిని క్రూరసేనుఁడు చంపినాఁడని కంచుకి పంపినవార్త వినినతోడనే, సైన్యసమేతుఁడనై కూ్రరుని పైకి దాడివెడలి, ప్రొద్దుగ్రుంకుటచే సేనలవిడిసి యీ యరణ్యంబున శయనించిన, వన్నిట్లో యీ చోరుఁడు కొనిపోయికారాగృహమునమంచనేఁ డా దొంగలందఱు మధుపానమత్తులై మైమఱచియున్న సమయమెఱిగి యుపాయమునఁ గారాగృహ భిన్నమొనర్చుకొని బైటఁబడి, నిన్నుఁ గొనివచ్చుచుండుటఁ జూచి వెంబడినే యేతెంచి, యిట్లొనర్చితి. అమ్మా! నీవొక్కదానవై యెట్లు బ్రతికితివి?

తార—అయ్యో! భూభరముకొఱకు (అని దుఃఖించును.)

విజ—(తనలో) అయ్యో! ఎంతకష్టమెంతకష్టము! ఇప్పుడు నేనా గాథ నేమాత్ర మడిగినను దుఃఖ మాపలేదు. కొంతయోదార్చిన పిదప నడిగెద, ఏమో ఘోరముగ నున్నట్లే యున్నది. (తారతో) అమ్మా! చల్లని యావృక్షముక్రిందఁ గొంత విశ్రమింతము రమ్ము.

(పోవుదురు)

3-వ రంగము

(రాంజట్టి మందిరము-కమలాదేవి, అనంతుఁడు,
గ్రీష్ముఁడను బాలురు ప్రవేశము.)

కమ—[అనంతు నెత్తుకొని గ్రీష్మునొక చేతఁబట్టుకొని] అన్నలారా! చిన్నతనమునఁ గష్టపడి విద్య పూర్ణముగ నభ్యసించినచోఁ పెద్దవారైన పిదప సుఖపడుదురు. పాఠశాలకుఁ బోననుటతప్పుకాదు?

అనం—(చంకనుండి) ఊఁ—నేను పోను. అయ్యవారు కొట్టుతాఁడు.

కమ—చక్కఁగా శాల నుప్పగించుచుఁ దప్పక పాఠశాల కేగుచున్న నయ్యవా రేల కొట్టును?

అనం—ఊఁ—ఊఁ—నేను పోను. (చంకనుండి జాఱును)

గ్రీష్మ—అమ్మా! నిన్నఁ దమ్ముఁడు రాకున్నను, నేను పోయి చదువు కొనలేదు?

కమ—[అనంతుని దింపి గ్రీష్ము నెత్తుకొని ముద్దాడి] నాన్నా! నీవు మంచివాఁడవు, బంగారు కొండవు.

అనం—(ఏడ్చుచు లోనికిఁ బోవును.)

గ్రీష్మ—తమ్ముని కెప్పుడుఁ జిఱుతిండి కావలెనని యేడ్చును నేను పోరుసేయుచున్నానమ్మా?

కమ—అన్నా! నీవు కడు మంచివాఁడవు.

(రాంజట్టి చిన్నభార్యయగు రాధాబాయి తనకొడుకగు
ననంతు నెత్తుకొని ప్రవేశము.)

రాధా—[కమలతో] ఏమే దుర్మార్గురాలా! నా సవతివలెనే నీకును నా కుమారునియెడఁ బక్షపాతమేనా?

కమ—అమ్మా! నా కేమి పక్షపాతము! నే నెత్తుకొని పాఠశాలకుఁ బొమ్మని బుజ్జగించిన నా చంకనుండి జాఱి పాఠశాల కేగనని యేడ్చుచు లోనికి వచ్చినాఁడు.

రాధా—వాఁడు చంకనుండి జాఱిన, గ్రుడ్లువెళ్ళఁబెట్టుకొని, గూబవలెఁ జూచుచు, నీ సడమంత్రపువాని నెత్తుకొని బుజ్జగించుచున్నావు? నీ మొగాన రెండుపూటలు పొట్ట పగిలిపోవునట్లు కుంభముఁ

శెట్టిని న్నుంచుకొన్నది? మా పిల్లలకుఁ జక్కఁగా దాస్యముఁజేయుటకా? నీకు పొగ రెక్కుటకా? దింపవేమి వానిని? [గ్రీష్మునిఁజూచి మొద్దువలె నెంత బాగుగ చంక నున్నావురా?

కమ—(గ్రీష్ముని దింపును.)

రాధా—[అనంతునిచ్చుచు] వీని నెత్తుకొని బుజ్జగింపుము.

కమ—(అట్లు చేయుచుండును.)

రాధా—(గ్రీష్ముని చేయిఁబట్టుకొని తనలో) వీఁడామా రెమ్మకుఁబుట్టినది మొదలు వీనిమీఁదను నాసవతిమీఁదను, నాభర్త కడుఁ బ్రేమగానుండును మ మ్మొక హీనులాగాఁ గనుచుండును. వీనినెటులైన మాయముఁజేసితి నేని, నా కుమారుని పీడయు, నాపీడయుఁ బాయును. నిన్నఁ గొంతవిషముఁ గూర్చితిఁగాని, వీలుకలుగదయ్యె. నేఁడెట్లోయుపాయమున నది వీనికిఁ దినిపింపవలయు.

గ్రీష్మ—అమ్మా! నే దాహము త్రాగివచ్చెదను. నన్ను విడువుము.

రాధా—(తనలో) నాకోరికయే సిద్ధించె (ప్రకాశముగ)పాల లోఁజక్కెర వేసి యుంచినాను. ఇచ్చెదరమ్మా. (గ్రీష్మునితోనిష్క్రమించును.)

అనం—మాయమ్మ పోవుచున్నది. నేను పోతాను దింపూ.

కమ—తండ్రీ! వలదు. మీయమ్మ యిపుడే వచ్చును.

రాధా—(గ్రీష్మునితోఁ ప్రవేశించును,) నీవు వీని నాడింపుచుండుము నే ననంతున కన్నముఁబెట్టి తీసుకొనివచ్చెదను (గ్రీష్మునిచ్చి తన కొడుకుతో నిష్క్రమించును.)

కమ—(గ్రీష్మునిఁ దొడపై నిడుకొని కూర్చుండి) అన్నా! నీ వన్నముఁ దిన్నావా?

గ్రీష్మ—అప్పుడే తిన్న! కాని, అమ్మా! నీవు తిన్నావా?

కమ—లేదు.

గ్రీష్మ—ఎందుకు తినలేదు? మాయమ్మ తినుమనలేదా! నేనుఁ బోయి పెట్టింతునా?

కమ—అన్నా! వలదు. మిమ్ముఁ బాఠశాల కంపి వచ్చి భుజించెదను. తండ్రీ! నాపై నీదయ పూర్ణముగ నున్నదా!

గ్రీష్మ—నిన్ను జూచిన ... దేవి ... నాకు మాయమ్మ జ్ఞప్తికి

...దు.

కమ—తండ్రీ! నీదయ. ఇంతమాత్రమునభిమానించిన ... 

...లును. (ముద్దిడుకొనును) ఆహా! యీగ్రీష్మని పలుకులు విన్నపు

...ల నాబిడ్డడు కనకసేనుని జ్ఞాపకము వచ్చి కడుపు పగిలిపోవుచుం

...ను. తండ్రీ! కనకసేనా! నిమ్ముద్దులు పిన్నయడవిపాలయ్యెగదా!

సీ. "అమ్మ యన్నము పెట్టు" ♦ మని యడుగును విద్య

డెవరిని పెట్టుమం ♦ ...వు కుమార!

భూషణాదులకున్నై ♦ పోరు చేసెద విద్య

డెవరిని జేరు నే ♦ తువు కుమార!

ఎత్తుకొమ్మని చేత ♦ లెత్తువుగద యిద్య

డెవరికి చేతు లె ♦ త్తువు కుమార!

అప్ప నన్నేమియో ♦ యనెనని యల్గును

వెవనిపై నిపు డల్గు ♦ దువు కుమార!

గీ. ఆటలాడి యలసివచ్చి ♦ యంకమందు

విశ్రమించెద విపు డెట ♦ విశ్రమింతు

వకట! కడుపు దుఃఖము పెట్టి ♦ యరిగినావె

రాయిబోలెను భూమిపై ♦ బ్రతుకుమనుచు.

గ్రీష్మ—అమ్మా! నానాలుక తిమ్మిరిబట్టినట్లున్నది కన్నులు

...రుగుచున్నవి. నాకేమో భయమగుచున్నది.

కమ—(సంభ్రమముతో) అదేమితండ్రీ!

గ్రీష్మ—(క్రిందబడిపోవును)

కమ—హా! నాతండ్రీ! (గ్రీష్మనిపైబడి) అయ్యో! కుమారా!

ఇంతలో ముద్దుమాటలాడి పడిపోయితివి. నే నేమి సేయుదు. నీతల్లి

దండ్రులుచూచి యెట్లు భరింతురు? నన్నేమందురు? వారికి నేనేమి

చెప్పుదు? ఓజగద్రక్షకా! నన్నేమి సేయుచుంటివి? ఇంతకన్న నన్నేమి

చేయగలవు? ఏమిచేసిన నాకేమి భయము?

...ము. నను నత్యంతముదంబుతో బెనుచు నా ♦ నాథు న్వెనజంపి కూ

తును నాముద్దులసూనుబాపి నను నెం ♦ తో గాసినొందించి ...

తిని నెట్లో నను బ్రోచువాని సుతుఁడీ ♦ తీరౌనటుల్ సేసి లో
చనముల్ వల్లఁగ నీవునుంటివిగదా ♦ ఇంకేమి నాకీశ్వరా!

(రాంజెట్టి రత్నాబాయి ప్రవేశించి)

రాం—ఎవరిచట నేడ్చువారు? (పడియున్న కొడుకుంజూచి) హా! కుమారా! యిదియేమిగతి? యేల యిట్లు పడియుంటివి?

రత్నా—(కుమారునిపైబడి) అయ్యో! నాతండ్రీ ఇంకేమున్నది? నాకొంపమునిగినది. (ఎదమోదుకొనుచు) అమ్మయ్యో! నా కడుపు కాలిపోయినది. ఇఁక నాకేమిదిక్కు? నేనేమిచేతు? హా! పుత్రా! పుత్రా!

రాం—అయ్యో! తండ్రీ! యిప్పుడేగదా నిన్ను పాఠశాలకుఁ గొనిపొమ్మని చెప్పితి. ఇంతలోనే నీకేమిగతి పట్టెనురా నాతండ్రీ! నిన్నెవరేమనిరి? (కమలతో) కమలా నాకుమారుఁడిట్లేల పడియున్నాడు?

కమ—నిష్కారణముగ నాతొడపైఁ గూర్చుండియుండి యొడలేమో తిరుగుచున్నదని పడిపోయినాఁడు. తండ్రీ! ఇంతకు నేనేక్రూర కర్మిణిని. నేనే దురదృష్టవంతురాలను.

రత్నా—అమ్మా! తొడలపైఁ గూర్చున్నవాఁడు నిష్కారణము మృతినొందిన నాదురదృష్టముగాని నీదురదృష్టమేలయగును.

రాధా—(ప్రవేశించి) అయ్యో! ఇదేమి! హాకుమారా! ఆట్లేల పడిపోయినావు? నిన్నేపాపులిట్లు చేసిరి? హాతండ్రీ! (అనిరుచ్చితముగ నేడ్చును)

రాంజ—అమ్మా నిష్కారణముగ నీ తొడలపైనున్నవాఁడు మృతినొందెననిన నెవరైన నమ్ముదురా?

కమ—అయ్యా! నేను వేఱేపాప మెఱుఁగను.

రాధా—ఏమీ నీతొడలపైఁ గూర్చున్నవాఁడు మృతినొందినాఁడా? ఏమీ యేమీ చెప్పవు? నాథా ఇంకేమున్నది. ఈపాపాత్మురాలింతకుమున్ను మన పుత్రుల పాఠశాలకు గొనిపోవుచుండ, మన పుత్రులెత్తుకొమ్మని పోరు చేసిన, ఏదియో విసుగు గొని గొణుగుచుంతలో, నేనంతున కన్నముఁ బెట్టెదనని

తీసికొని పోవుచుండఁ దానును గ్రీష్మునిడించి లోనికివచ్చి గిన్నెలో బాలుఁబోసికొనిపోయె అయ్యో! వానిబుజ్జగించుటకుఁ బాలుఁద్రాపు నేమో యనుకొంటినిగాని, యింతచేయు ననుకొనలేదు. (కమలను చూచి) ఓసీ దుర్మార్గురాలా! యెంతటి గొడ్డురాలవే. పసిపాపని జంపుటకు నీ మనం బెట్లొప్పెనే? వాండ్లను సాఁకుటకు నీకు చేత గాకున్న నాచేత గాదని చెప్పిన నిన్ను నిర్బంధింతుమా? మా కొడుకుల మేము కన్నులలోఁ బెట్టుకొని సాఁకుచుందుముగదా. అయ్యో! నాథా! అనంతుని నేఁ గొనిపోకున్న వాఁడుకూడ నిదివఱకు అన్నను జేరం బోయెడివాఁడే కదా! (గ్రీష్మునిపైఁబడి) హా కుమారా! నీ కేమి గతి పట్టెనురా!

రాంబ—(కమలతో) ఓసీ దుర్మార్గురాలా! పాపిష్ఠురాలా! నీవు నాఁ డరణ్యములోఁ జచ్చెదనని, దుఃఖించుచుండ, యోదార్చి నిన్నుఁ గొనివచ్చి నా బిడ్డవలెఁ బోషింపుచున్న నా పుత్త్రుని బొట్టఁ బెట్టుకొని యేది యెఱుఁగవట్లుంటివి కదే. నాపుత్త్రునిపాలిటి మృత్యుదేవతనుఁ బోలె, నిన్ను బుద్ధిపూర్వకముగఁ దెచ్చి యింటఁ బెట్టుకొంటిఁగదే. రక్షించినవాని భక్షించుటకు నీ మనం బెట్లొప్పెనే దుష్టురాలా!

కమ—[నిశ్చేష్టిత యగును]

రత్నా—అయ్యో! పాపాత్మురాలా! కూఁతురుఁ గుమారుఁడు జచ్చినారని యెంతయో కడుపుదుఃఖముగలదానివలె, నటించితివి కదే. మాపుత్త్రులకాధారమై యుండువని నిన్నొక దైవముగాఁ జూచుకొన్నందులకు నాకొడుకునే మ్రింగితివిగదే. నీచేతఁ గాదని చెప్పిన దండింతువా. (కొడుకుపైఁబడి) హా! కుమారా! నీయొడలెల్ల నల్లబడుచున్నదేల? హా! నను గన్న తండ్రీ! హా! నాతపఃఫలమా! హా! పుత్త్రా! పుత్త్రా!

కమ—(దుఃఖముతోఁ దలవంచుకొనును)

రాధా—ఓసీ మారెమ్మా! నలుగురికిఁ జూడ నంగనాచివలె నుంటివిగదే! ఏమి యెఱుఁగనట్లుండి యెంతపనిఁ జేసితివే; నాటినుండి

యెంత నక్క-వినయములు గనుపించితివే. మా కొడుకును కడేఁగా జేసుకొని మొద్దువలె నేమియు మాటాడవు గదే ?

(రక్షకభటులు ప్రవేశించి)

భటు—రాంజట్టీ! యేమి యీ కలకలము ?

రాంజ—అయ్యా! యీదుర్మార్గురాలు నాపుత్త్రుల సాఁకుఁ గదాయని యింటఁబెట్టుకొని పోషించు చున్నందులకు, నేఁడు నా సుతునకేమో మందుఁబెట్టి చంపినది.

భటు—అటులనా! అపరాధము నిర్ధారపడినచో నాయువు మూఁడిన దనుకొనుఁడు. సరే! న్యాయస్థానమునకు నడువుఁడు. ఈ శవమును వైద్యశాలకుఁ బ్రస్తుతము తీసికొని పొండు.

(అందఱు నిష్క్ర-మింతురు)

4 వ రంగము—న్యాయస్థానము.

(కనకసేనుఁడు, మతిమంతుఁడు, దేవబలుఁడు, సువర్ణుఁడు, న్యాయ సహాయులు, కమల, ఖుస్రూ యను సేవకుఁడును ప్రవేశము)

కమ—(బోనులో)

కన—సచివవరా! ఈ నేరమును విచారణముఁజేయఁ బ్రారంభించు చున్నాను.

మతి—చిత్తము. ఖుస్రూఖాన్ ! రాంజట్టిని బిలువుము.

ఖుస్రూ—రాంజట్టీ! రాంజట్టీ! రాంజట్టీ! (అని పిలుచును)

రాంజ—(ప్రవేశించి) అయ్యా!

మతి—రాంజట్టీ! నీవా బోనులోని కెక్కి- నేఁ జెప్పినరీతిఁ బ్రమాణ మొనర్పుము.

రాంజ—చిత్తము. (బోనుఁ జేరును)

మతి—దేవునియెదుటఁ బ్రమాణ మొనర్చి నిజముజెప్పెదనను.

రాంజ—(అట్లనును)

మతి—నీ పేరేమి ?

రాంజ—రాంజట్టి.

మతి—నీ తండ్రిపేరు ?

రాంజ—నానాజీ

మతి—నీ వయసెంత?

రాంజ—నలువదియైదు సంవత్సరములు.

మతి—నీ కుల మేమి?

రాంజ—జట్టీ కులము.

మతి—నీ కేమి జీవనము?

రాంజ—కులవృత్తియే.

మతి—కాఁపురము ?

రాంజ—విశాలనగరము.

మతి—(తా వ్రాసిన పత్త్రిమును కనకసేనున కిచ్చును)

దేవ—(లేచి) రాంజట్టీ! నీకుమారుఁ డెట్లు మృతినొందినాఁడు!

రాంజ—ఈదాసివలన. (దాసిని జూపును)

దేవ—దాసి యెట్లు చంపినది?

రాంజ—మందుఁ బెట్టి.

దేవ—మందుఁ బెట్టుట నీవు చూచితివా?

రాంజ—నేఁ జూడలేదు.

దేవ—సాక్షు లున్నారా?

రాంజ—ఇతరు లెవరును లేరు; నాచిన్నభార్యయగు రాధాబాయి చెప్పుటచేతఁ దెలిసికొంటిని.

దేవ—ఈవిషయమున నీ పెద్దభార్య యేమియుఁ జెప్పలేదా?

రాంజ—లేదు.

దేవ—[కూర్చుండును.]

సువ—[లేచి] ఈదాసిని నెచటినుండి పిలుచుకొనివచ్చితివి? నీయింటనుండి యెంతకాలమైనది?

రాంజ—ఒకనాఁడరణ్యమున నీమె దిక్కులేక విలాపమున సంచరింపుచు నొక్క బెబ్బులివాఁతబడి భయభ్రాంతయై తిరుగుచుండ నే నావఱకే వేఁటకై చని యందొక పొదచాటున మాటువెట్టుకొని యున్న వాఁడ నగుటంజేసి, యది చూచి యాబెబ్బులి నంతమొందించి యీమె నోదార్చి నాయింటఁ బిల్లవాండ్రఁ గాపాడుటకై

యేర్పఱచి తీసికొనివచ్చితిని. ఒక సంవత్సరమైనది. తదాదిగా నా యింటనే యున్నది.

సువ—ఈమె దేయూరైనది నీకు తెలియునా?

రాంజ—తెలియదు.

సువ—నీ వెన్నఁడు నడుగలేదా?

రాంజ—అడిగినప్పుడెల్ల దుఃఖించుటచేత నది యడుగుటయే మానితి.

సువ—ఊరు పేరులఁజెప్పనప్పు డీమెయందు సందేహమేమి యుఁ గలుగలేదా!

రాంజ—లేదు.

సువ—ఎందుచేత?

రాంజ—నాఁటనుండి యీమె సుగుణములును నడవడికలను జూచుచున్నవాఁడ నగుటచే, నామ మాత్రమున దాస్యపుఁబనుల యందుంచితిఁగాని యెల్లవిషయములను, నాతల్లివలెఁ జూచుచుంటి. ఈ నాఁటికి [నొసలు గొట్టుకొనుచు] నాప్రారబ్ధమునో, మఱి యే కారణముననో, యీమె కంతటి దుర్బుద్ధిపుట్టె. కలనైన నిట్లగునని తలంపనైతి.

సువ—సంవత్సరమునుండి యిదిగాక నీమెయందొక దుర్మార్గమైనఁ గనిపెట్టలేదా?

రాంజ—లేదు.

సువ—ఈమెను నీ వేయేర్పాటుతో నింట నుంచికొనినావు?

రాంజ—నా కొడుకుల నీమె కాపాడుటయు, నీమెకు నేను భోజనము జరుపుచుండుటయు.

సువ—నెల కింతయని ద్రవ్యమేమైన నిచ్చెదవా?

రాంజ—ఈమె నన్నడుగలేదు. నేనియ్యను లేదు! ఆయేర్పాటును లేదు.

సువ—ఈమె మీకుఱ్ఱవానికి బెట్టిన విషము నెట్లు తెగలిగిన దని యూహించితివి.

రాంజ—ఈమెకు మూలిక లనేకములు తెలిసియుండుటచేత.

సువ—అది నీ వెట్లు తెలియఁగలిగితివి?

రాంజ—వ్యాధిగ్రస్తులైన బీద లనేకు లీమెయొద్దకు వచ్చుచుండుటయు వారి కీమె యెవ్వియేని మూలికలఁ జెప్పుచుండుటయుఁ జూచుటచేత.

సువ—ఈమె వారికట్టులఁ జెప్పి ద్రవ్యార్జన మేమైనఁ జేయునా?

రాం—వారీయవచ్చినను దీసికొనదు.

సువ—నీవు నీయిద్దరి భార్యలను సమానముగ జూచెదవా?

దేవ—ఆప్రశ్న యనవసరమైనది.

సువ—నీపెద్దభార్య పేరేమి?

రాం—రత్నాబాయి.

సువ—రత్నాబాయిని కూడ గొంతవిచారింప నవసరమై యున్నది.

దేవ—ఈనేరమున రత్నాబాయి సాక్షిగానేర్పడియుండలేదు.

కన—సాక్షిగానుండకపోయినను యామె వాఙ్మూలముప్రభుత్వమువారి పక్షమున నవసరమైయున్నది. రాంజట్టీ! నీవుపోవచ్చును.

(రాంజట్టి పోవును.)

ఖుస్రు—రత్నాబాయీ! రత్నాబాయీ! (అని పిలచును)

రత్నా—(ప్రవేశించును, మతిమంతుఁడు ప్రమాణముజేయించును.

మతి—నీపేరు?

రత్నా—పేరు రత్నాబాయి; భర్త రాంజట్టీగారు, వయసు ముప్పదియైదు, వాస మీవిశాలనగరము.

సువ—రత్నాబాయీ! నీకుమారుని మరణమునకుగతమేమి?

రత్నా—(నొసలు కొట్టుకొనుచు) నా ప్రారబ్ధమే.

సువ—ఈదాసి మీయింట నెన్నఁడేమి నేరముగాని చేసినదా?

రత్నా—నేనెరుఁగను.

సువ—ఈమెకు మందులేమైనఁ దెలిసియుండునా?

రత్నా—రోగులకపుడపుడేవియో మూలికలను జెప్పుట మాత్రము వినుచుందును.

సువ—రోగులకడ ద్రవ్యమేమైన దీసికొనునా?

రత్నా—నే నెన్నఁడు చూడలేదు.

సువ—ఈమెగాని మతియెవరైనగాని నీకుమారునకు మందు బెట్టినారని కనుమానమేమైనయున్నదా ?

రత్నా—అయ్యా! నాకెవ్వరియం దనుమానములేదు. పుత్త్రశోకమున నున్న నన్నేమి అడిగెదరు? నన్నింతటితో వదలుడు. నాదుఃఖము నాపుకొనలేకున్నాను.

కన—మంచిది పొమ్మా. (రత్నాబాయి పోవును)

మతి—ఖుస్రూ! రాధాబాయిని పిలువుము.

ఖుస్రూ—రాధాబాయీ, రాధాబాయీ, (అనిపిలచును)

రాధా—(ప్రవేశించి ప్రమాణానంతరము) పేరురాధాబాయి, భర్త రాంజట్టీగారు, వయసు ఇరువదియైదు. వాసము విశాలనగరము.

దేవ—రాధాబాయి! నీసవతి కొడుకగు గ్రీష్ముని మరణము నకు గతమేమో నీవెఱుంగుదువా?

రాధా—ఎఱుగుదును.

దేవ—ఎందువలన మృతినొందినాడు?

రాధా—మందుచేత.

దేవ—మందెవరు పెట్టినారని నీయభిప్రాయము?

రాధా—ఈదాసి పెట్టినది.

దేవ—అదినీకెట్లు తెలియును?

రాధా—ఈదినముదయమున నాకుమారుఁడగునసంతునికన్న మిడుతటి నీదాసి మాయింట గూటిలోనున్న పాలగిన్నెను తీసికొని పోవుచుండ నేఁజూచి యెందుకని యడుగగా అమ్మా! నేఁడు నాకాఁకలియగుచున్నది. ఈపాలు నేత్రాపేదనని చెప్ప మంచిది త్రావుమంటిని. ఆపాలగిన్నె నీమెతీసుకొని పోయెను. పిదప నాకొడుకున కన్న ముదినిపించి నేను వాకిటలోనికిఁ బోవుసరికి దాసియొద్దఁ గ్రిందఁబడి నోటఁ జొంగలువచ్చు గ్రీష్ముని జూచితిని.

దేవ—నీవు నీకుమారునకన్నము దినిపించుట కెంతకాలము పట్టినది ?

రాధా—చిన్నతనముగుటచే నతఁడు తిన్నగా భోజనము చేయఁడు. కావునరమారమీా యొకగంట యాలస్యమైనది.

దేవ—దాసి విషముఁ బెట్టినదని నీకెట్లు తెలిసినది?

రాధా—కుఱ్ఱవానికిఁ బాలు త్రావించుచుండగాఁ జూచిన సోమేశ్వరదీక్షితులను బ్రాహ్మణుఁడు నాకుఁ జెప్పుటచేతను, దాసి మా పిల్లలపై నపు డపుడు విసిగికొనుచుండుట నే నెఱిఁగియుండుట చేతను, క్రిందఁబడియున్న గ్రీష్ముని నోటినుండి చొంగలుపడుటచేతను దాసి తా నప్పుడే తీసికొనిపోయిన పాలలో విషముఁగలిపి యా బాలుని కిచ్చియుండెనని నే నూహించితి.

దేవ—(కూర్చుండును)

సువ—రాధాబాయీ! నీకొడుకునకు నీవును, నీసవతి కొడుకునకు నీసవతియు భోజనముఁ బెట్టుచుందురా?

రాధా—సమయానుకూలముగ నేనును నాసవతియుఁ బెట్టుచుందుము.

సువ—మీపిల్లవాం డ్రొక్కచోట భోజనముఁ జేయురా!

రాధా—పసివాం డ్రగుటచే కొట్లాడుదురని వేఱ్ఱేఱుగఁ బెట్టుచుందుము.

సువ—ఒక్కసారియా? వేఱ్ఱేఱు సమయములయందా?

రాధా—(ఆలోచించును)

సువ—ఏమీ? త్వరగా నుత్తర మీయవలెను.

రాధా—ఒక్కసారిగ నే పెట్టుచుందుము.

సువ—రత్నబాయి నీవును, నొక్కయింటిలోనే కాఁపురము జేయుదురా?

రాధా—ఒక్కయింటిలోనే యుందుము.

సువ—నీకొడుకున కన్నముఁ బెట్టునపుడు నీ సవతికొడుకును భోజనము జేయుట కేల పిలువలేదు?

రాధా—పిలిచితిని ఇంటిలో లేకుండె.

సువ—నీ వీదినమున నిదురలేచినది మొదలు నీపిల్లవాడన్నము దినువఱకు నీ వెచ్చటికినిఁ బోలేదా?

రాధా—లేదు. ఇంటిలోనే యున్నాను.

సువ—నీపిల్లవాని కన్నముఁ బెట్టుతఱి గ్రీష్ముఁ డెచటనున్నాడని నీవు విచారింప లేదా?

రాధా—లేదు.

సువ—ఎందుచేత.

రాధా—అతని తల్లి పెట్టెనేమో యనియు, లేక తరువాత వచ్చి తినుఁగదాయనియు విచారింపనైతి.

సువ—నీకొడుకునకన్నముఁదినుపించునప్పటి కెన్నిగంటలైనవి?

రాధా—సుమారు 9 గంటలు కావచ్చును.

సువ—ఆయుదయమునుండి యిప్పటివరకు నీసవతి యింటిలో నున్నదా?

రాధా—ఇంటిలోనే యున్నది

సువ—నీపిల్లవాఁడన్నముఁ దినిన తరువాతనైన గ్రీష్ముని భోజన విషయము విచారింపలేదా?

రాధా—విచారించితిని—లేదు. లేదు.

సువ—ఏమి లేదు?

రాధా—విచారింపలేదు. విచారించునంతవఱకేదీ? అనంతుఁడన్నముఁ దినఁగానే వాఁకిటిలోనికిం బోయితిని. గ్రీష్ముఁడుపడియుండె. నేను విచారించినదాఁక నున్నదా?

సువ—గ్రీష్మునకుఁ దల్లి యన్నముఁబెట్టుచుండఁగా నీవు చూడలేదా?

రాధా—నే నింటిలో యుంటినికాని అతని కామె యన్నముఁ బెట్టినట్టులేదు.

సువ—అనంతుఁడన్నముఁ దినునప్పుడు నీభర్త యింటిలో నున్నాఁడా?

రాధా—ఇంటిలోనే యున్నారు.

సువ—నీపిల్లవాఁడన్నముఁ దినుచున్నప్పుడు నీభర్త గ్రీష్ముని విచారింపలేదా?

రాధా—మఱే! పిల్లడాంద్రపై వారి కంత శ్రద్ధయా?

సువ—రత్నాబాయికూడ విచారింపలేదా?

రాధా—ఆమె విచారించినదేమోకాని న న్నడుగలేదు.

సువ—నీ సవతియు, నీవును, సఖ్యతగా నుందురా?

రాధా—సఖ్యతగానే యుందుము.

సువ.—నీభర్త యిరువురిమీద సమానముగ వర్తించునా ?

దేవ—ఈప్రశ్న యనవసరము అదిగాక యీరాధాబాయి స్త్రీయగుటచే, భయమునొంది మాటాడుటలో తడఁబడుచున్నది ఇఁక నీమెను విచారించుట సమంజసము కాదు

కన—మఱల నింకొకతూరి విచారించుట కాజ్ఞయీయఁబడదు. ఇపుడే విచారింపవచ్చును

సువ—గ్రీష్ముఁడన్నముఁ దినియున్నాఁడని కదా నీయప్పటి యభిప్రాయము ?

రాధా—అవును.

సువ—[కూర్చుండును]

మతి—రాధాబాయీ! నీ వేగుము. ఖుస్రూ ! సోమేశ్వర దీక్షితులను పిలువుము.

ఖుస్రూ—షోమేసర్ దీచ్చాతుల్ ! షోమేసర్ దీచ్చాతుల్ ! (అని పిల్చును)

సోమే—[ప్రవేశించును]

ఖుస్రూ—(తనలో) ఈడు భామ్మన్నార్థాల్ సేసీసేసీఖూరెల్ ఖూరెల్ తిని పెద్దా ధున్నాలాగా బల్సినాడ్ యీనికిపనిలేద్ పాట లేద్ ఖష్టంబీలేద్. యీన్హాల్లామీదాపడీపడీ మొక్కిమొక్కిడబ్బుల్ రూపాయల్ యిచ్చి తిండీఖూడా యేస్తార్. బాప్రే! పెద్దాబేతాల్లాగా హెంఁబాగావుండావ్ రేలయ్యా! నీది హెంతహద్దుష్టం !

మతి—(ప్రమాణము చేయించిన పిదప)

సోమే—తండ్రిపేరు రామేశ్వరసోమయాజి, వయ సఱువది, కులము బ్రాహ్మణులము, వృత్తి యీనాములు మొదలగునవి, కాపురము విశాలానగరము పేరు, సోమేశ్వర దీక్షితులు.

దేవ—రత్నాబాయికొడుకునకు ఈదాసి మందుఁబెట్టినదను విషయమున మీ కెఱిఁగినదంతయు వచింపుఁడు.

సోమే—నే నీదినము మాయింటనుండి పెద్దవీథి సమీపముగా నుండే కూరగాయలయంగడికిఁ బోవుచుండఁగ రత్నాబాయి కుమారుఁడగు గ్రీష్మునకు ఈదాసి పాలుద్రావించుచుండ నేఁ జూచితి.

దేవ—ఆపాలు ద్రావించుట వీథిలోనా ? లేక యింటిలోనా ?

సోమే—రాంజట్టి యింటిముందు వీధిలో నొకప్రక్కకు ఆ పిల్ల వానిం దీసికొంపోయి; అచ్చట నాపిల్లవానిఁగనుపడి కనుపడనట్లుంచి త్రాగించుచున్నది.

దేవ—పాలుత్రాగించినమాత్రమున విసముఁబెట్టినదని యెట్లు తలంచితివి ?

సోమే—నే నప్పుడట్లు పెద్దవీధికిఁ బోయి శాకములను దీసి కొని వచ్చుచుండుసరికి నాపిల్లవాఁడు క్రిందఁబడి నోటఁ జొంగలు గార్చుచు దేహస్మృతిఁ దప్పియుండెను. అందువలన పాలలో విషము గల్పి త్రాగించినదని నేఁ దలంచితి.

దేవ—ఈ సంగతి నచట నున్నవారితోఁ జెప్పితివా ?

సోమే—వారంద ఱాపిల్లవానిచుట్టుఁ జేరియేడ్చుచుండ రాధా బాయితో మాత్రము చెప్పితిని.

సువ—దీక్షితులుగారూ! మీరిదివర కెప్పుడైననాస్థానములలో సాక్ష్యమునకు గాని, మఱి యేవివాదములయందుఁగాని, వచ్చినారా ?

సోమే— రాకయేమి ! కావలసినన్నిసార్లు వచ్చినాను.

సువ-ఈదాసి గ్రీష్మునకు విషము బెట్టినపుడు మీరుచూచినారా?

సోమే—పాలుఁ ద్రావింపగా జూచినాను.

సువ-ఆపాలు ద్రావించినపుడు రాధాబాయి యెచ్చటనున్నది?

సోమే-రాధాబాయి వీధిగుమ్మములోనుండిలోనికిపోవుచున్నది.

సువ—ఆమె ఈపాలు దాగించుటఁ జూచినదా ?

సోమే—అబ్బే ! ఆమె గొడవలో నామె పోతూయున్నదిగాని ఆమె యీ విషయమే యెఱుగదు.(దేవబలుని జూచును)

సువ—అక్కడ నేమిచూచుచున్నారు. ఇటు చూడుడు. శాక ముల కొరకు పోయివచ్చువఱకు నెంతకాలమైనది ?

సోమే—ఆ ! సుమారు గంట గంటన్నఱ పట్టినది.

సువ—పాలుఁదావించుచున్నప్పటి కెన్నిగంటలైనది ?

సోమే—ఆ ! ఉండును. సుమారు యేడుగంటలు కావచ్చును.

సువ—కావచ్చుననియేగాని సిద్ధాంతముగఁ జెప్పలేరా ?

సోమే—నా శాస్త్రము, మాదగ్గిర గడియారా లేడుస్తాయా ? మే మేమి వుద్యోగా లేడుస్తామా ?

సువ—పోనీ యాపిల్లవాడు పడియున్న చోటికి మీరు తిరిగి వచ్చుసరికి యెన్నిగంటలైనది?

సోమే—సుమారు తొమ్మిదిగంటలు కావచ్చును.

సువ—అటులగాదు సరిగాఁ జెప్పవలె.

సోమే—నాపిండాకూడు. నాదగ్గర గడియారాలులేవయ్యా!

ఖుసూ్రి—అరే! యేమివయాయిది సర్కార్ ఖచేరి. అర్సా ఖూడ్దూ భూప్.

సోమే—ఔనోయ్! మాకు తెలియదు. లక్షతొంబైసార్లు చూచినాము? (తనలో) ఈ తురకపిశాచముకూడా దాపరమైనదే.

మతి—దీక్షితులుగారూ! యిందు మీరరచిమాట్లాడగూడదు అడిగినదానికి సరిగా చెప్పవలె.

సోమే—తెలిసినంతవరకు చెప్పకమానుదునా? నేనుచచ్చినా అబద్ధమాడను.

సువ—తొమ్మిది గంటలైనదా?

సోమే—ఆ! అయినది.

సువ—కూరగాయలు మాత్రమే తెచ్చినారా? మార్గమధ్యమున నెవ్వరితోనైన మాట్లాడినారా?

సోమే—మధ్యమాట్లాడడానికినా కెవ్వరుస్నేహితులుచచ్చారు.

సువ—చక్కగా నింటికే వచ్చినారా?

సోమే—అవును.

సువ—మీయింటికి కూరగాయల యంగడికి నెంత దూరముండును.

సోమే—ఆ! ఉంటుంది, ఇక్కడికి పంతులుగారి మేడ నెంత దూరమున్నదో అంతయుంటుంది.

సువ—అదికాదు ఎన్నిరాళ్ళ దూరముండును?

సోమే—నాకు రాళ్లు తెలియవు, రప్పలు తెలియవు, నా యొద్దగొలుసులులేవు కొలవడానికి.

సువ—పోనిండు. మీరు గంటకెన్ని క్రోసులు నడువగలరు?

సోమే—ఆ! నాపడుచుదనంలోగంటకు రెండుక్రోసులునునా యాసముగా నడిచేవాణ్ణి.

సువ—ఇప్పుడో?

సోమే—ఇప్పటికైనా క్రోసున్నర నడవఁగలను.

సువ—కూరగాయల యంగడికి మీయింటికి నొకట్ల కోసు దూరముండునా?

సోమే—అబ్బే! అంతయెక్కడిది? ఇందాక చెప్పలేదూ?

సువ—క్రోసుకు తక్కువయే యున్నదా?

సోమే—పావుక్రోసుకుఁ గూడ తక్కువే.

దేవ—ఈద్విజుఁడు వయసుమీరినవాఁడును. అదియునుఁగాక చపలచిత్తము గలవాడునై యున్నాడు. కాన నితని సాక్ష్యము గ్రహింపదగినది కాదని నాయభిప్రాయము.

కన—ఇఁక నీదీక్షితులను విచారింపనవసరములేదు.

మతి—దీక్షితులుగారూ! మీరు పోవచ్చును.

ఖుస్రూ—సోమేసర్ సాహెబ్! అరే! సాహెబ్ కాదు. దీచ్చాతుల్ గారూ! అవత్లా పోండి. మీపనిఅంతా అయింది.

సోమే—[నిష్క్రమించును]

కన—సచివవరా! ఈదాసీ వాఙ్మూలముఁ గొనవలయు.

మతి—దాసీ! నీనివాసస్థలమేది?

దాసి—సంవత్సరమునుండి రాంజట్టీగారి భవనము.

మతి—అదివఱకు?

దాసి—తండ్రీ! అది నన్నడుగకుఁడు!

కన—పోనిమ్ము నీపేరు?

దాసి—ఇప్పటికి దాసియనిపేరు.

కన—(తలయూపుచు) గ్రీష్మునకునీవువిషమిచ్చినదిసత్యమేనా?

దాసి—నేనెఱుఁగను.

కన—ఇతఁడు విషముచేతనే మరణించెనా?

దాసి—విషముచేతనేయని తోచుచున్నది.

కన--నీవుకానిచో మఱి యెవరిచేత నీతనికివిషముపెట్టబడినది?

దాసి—ఏమో.

కన—ఎవరైన పెట్టినారని చెప్పగలవా?

దాసి—చెప్పజాలను.

కన—నీ కెఱుకయే లేదా?

దాసి—దైవమున కెఱుక.

కన—నీవే బాలునకు మందు పెట్టి చంపితివని నేరము రూఢ మైనది. ఇందుకు నీ వేమనియెదవు?

దాసి—మందు నేను పెట్టలేదు. ఇతర మేమియు నెఱుఁగను.

కన—రాంజట్టీ, దీక్షితులు, రాధాబాయియు నీవే మందుఁ బెట్టితివని చెప్పుచున్నారు. ఒప్పుకొందువా?

దాసి—అనృతమాడను.

కన—రాధాబాయి యెన్నఁడేని నీయెడలఁ గోపముగ నుండునా?

దాసి—రామరామ!

కన—ప్రేమముగఁ జూచునా?

దాసి—చూచును.

కన—గ్రీష్మున కీయుదయ మేమైనఁ బాలు త్రాగించితివా?

దాసి—నాకు పాలసంగతియే తెలియదు.

కన—నీకు పాలసంగతి తెలియనట్లు నీ కెవరైన సాక్షు లున్నారా?

దాసి—ఇంతటి హీనురాలియెడల సాక్ష్య మెవరు చెప్పుదురు?

కన—ఉదయమునుండి నీ వెవరియొద్ద నుంటివి?

దాసి—రాంజట్టిగారి కుమారులదగ్గర నుంటిని.

కన—రాధాబాయి కుమారుఁడుగూడ నీదగ్గర నున్నాఁడా?

దాసి—ఉన్నాఁడు.

కన—అతనిని విచారింపవచ్చునా?

దాసి—ప్రభువు చిత్తము.

కన—రాధాబాయి కొడుకగు ననంతుని, రాధాబాయినిఁ బిలువవలయును.

ఖుస్రు—రాధాబాయీ! అనంతుడూ! (అని పిలుచును.)

రాధా—అనం—(ప్రవేశింతురు.)

మతి—(అనంతుని ప్రమాణముఁ జేయించును.) నీ పేరే?

అనం—అనంతుఁడు.

మతి—తండ్రి పేరు?

అనం—రాంజెట్టి.

మతి—నీ వయసెంత?

అనం—ఏమో.

రాధా—తొమ్మిది సంవత్సరములు.

కన—అవి యన్నియు నా బాలుఁడు చెప్పఁజాలఁడు. బాలకా! (రాధాబాయిని జూపుచు) ఈపె యెవ్వరు?

అనం—మా యమ్మ.

కన—(దాసిని చూపుచు) ఈమె యెవ్వరు?

అనం—నన్నెత్తుకునే అమ్మ.

కన—మంత్రీ! యీ బాలుని విచారింపుము.

మతి—ఈ యుదయమున ని న్నెత్తుకునే అమ్మ ఏమి చేసినది?

అనం—నన్ను పాఠశాలకు రమ్మన్నది.

మతి—(తనలో) ఇదియేమో యున్నది. (ప్ర) నీ వేమంటివి?

అనం—నేను రానని చంకనుండి జారిపోతూయుంటే మా అమ్మ వచ్చి న న్నెత్తుకొని [దాసిని చూపి] ఈమెనుకోపము చేసినది.

మతి—కోపము చేసిన పిదప ని న్నెత్తుకొని లోనికిఁబోయినదా?

అనం—నన్ను బుజ్జగించి యీమెకు న న్నిచ్చి, మాయన్నను లోనికిఁ దీసుకపోయి కొంతసేపటికి మఱల మా యన్నను దీసికొని వచ్చి [దాసినిఁ జూపుచు] ఈమె కప్పగించి నన్నుఁ దన వెంబడిఁ దీసికొనిపోయినది.

మతి—ఈ యెత్తుకునే అమ్మ నీకు పాలేమైన నిచ్చినదా?

అనం—ఈమె నా కీయలేదు కాని, మా అన్న మీయమ్మ నాకు పాలు యిచ్చినదని మాత్రము చెప్పినాఁడు.

మతి—(కూర్చుండును.)

కన—(దాసితో) ఏమమ్మా! యీ నేరము రాధాబాయి యొనర్చినదను ననుమానము నీ కింతయైన లేదా?

దాసి—కనులతోఁజూడనిది యనుమానమును స్థిరపరచుట గూడ తప్పేయని నాయుద్దేశము. నాకట్టి యనుమానము కలుగలేదు.

కన—అదియుండనిమ్ము, నీయూరిపేరులఁ జెప్పుటకు నీకేమి సంశయము?

దాసి—తండ్రీ! అది నన్నడుగకుఁడు, (కనకునుజూచితనలో) హా! హృదయమా! వ్రక్కలు కాకుము.

కన—రాజాస్థానమునఁ జెప్పకున్న దప్పగును.

దాసి—తప్పులున్న శిక్షింపుఁడు.

కన—శిక్షనొందుటకు నీ కింత సాహసమేమి? శిక్ష యన నేమిగాఁ దలంచితివి! అతికష్టము.

దాసి—కష్టజీవులకు సుఖమెట్లు లభించును? తండ్రీ! అవి యన్నియు నేల నాయూరిపేరులమాత్ర మడుగకుఁడు, అవసరమున్నఁ బ్రస్తుతాంశముల నడుగుఁడు. నేఁదెలియువరకు నిజముఁ జెప్పెదను.

రాధా—ఈ విషయమున నీకెట్టియనుమానమును లేదా?

దాసి—లేదు.

కన—రాధాబాయీ! నేర మొనర్చిన దీ దాసియనియేనా నీ నిశ్చయము?

రాధా—అయ్యా! ఇదితప్ప నింకెవ్వరును లేరు. ఇది చాలా మాటకారి; మాయలాడి; మంచులబుట్ట; నాకొంపముంచినది! పైగా నేమియు తెలియని నాకొడుకును సైతము తనవశము చేసికొని యీ దుర్బోధనలు బోధించినది.

కన—(దాసితో) అమ్మా! నీకు రాధాబాయి యెడల ననుమానము లేదనుచున్నావు. రాధాబాయి నీవే యీనేర మొనరించితి వనుచున్నది! నీనిజవృత్తాంత మాద్యంతము విచారించినఁగాని నిర్ధారణ మొనర్చుటకు వీలులేదు. కావున నీవృత్తాంత మెఱింగింపక తప్పదు.

దాసి—తండ్రీ! ఈపాపినీ చరితంబు వినునంతటి పట్టుదల మీకేల కలుగవలయు? ఇది రామకథయా, పుణ్యచరితమా, కాదు. కడు హేయమగు కథ మీబోంట్లు వినదగినదికాదు. (తనలో) ఈ ప్రభువును జూచినపుడెల్ల నాయెదఁ జల్లుమని సంతోషసహితమగు దుఃఖము మాటిమాటికిని మనంబున నావరించుచున్నది. ఈ ముఖ వికాసము, ఈముద్దుపలుకులు, ఈ తెలివితేటలు చూడఁజూడ, నా బిడ్డఁడు కనక

సీనునివలెనే తోఁచుచున్నది. అయ్యో! యెంతటిభ్రాంతి! యెట్టి మనో వికలత! ఇంకను నాకు పుత్త్రుఁడా! ఆహా! మానసమా! హా! చంచలమా!

తే. గీ. వరుని నాత్మజులను బాసి ♦ వనధిగూలి
చావునకుఁ దప్పి దాస్యంబు ♦ సలిపి యిపుడు
దండనకుఁ జిక్కి మృతికి సి ♦ ద్ధము గ నున్న
సమయమునసైన మనము చం ♦ చలత విడదు!

ఆహా! దాస్యకృత్య మెంతపఱకు ఫలించినది.

తే. గీ. అగ్నితోనైన జలముతో ♦ నైననురిని
నైన యాయుధముతోడ ♦ నైనగాని
బ్రతుక లేకున్నఁ బ్రాణము ♦ ల్బాయవచ్చు
దాస్యమెట్టివారలకైనఁ ♦ దగదు తగదు.

[వైద్యుఁడు - గ్రీష్ముడు - ప్రవేశించును]

వైద్యు—జయము జయము మహారాజా!

కన—ఓయీ! యీ బాలకుఁ డెవరు?

వైద్యు—దేవరవారు విచారించెడి యీనేరమున మందుబెట్టబడిన బాలుఁ డితఁడే.

కన—(విస్మయముతో) ఏమీ! ఎట్లు బ్రతికినాడు?

వైద్యు—ఇతనికిఁ బెట్టబడినమందు చావదగినంతవఱకుఁ వ్యాపింపనిదే నాదగ్గఱకు దీసికొనివచ్చిరి. వెంటనే తగిన యౌషధమునుప యోగింప నామందు విరిగిపోయి యితఁడు చక్కఁబడినాడు.

కన—మతిమంతా! యీ బాలకుని విచారింపుము.

మతి—బాలకా! యీదాసి నీ కీ యుదయమున బాలు త్రాగించినదా?

గ్రీష్మ—కాదు. [రాధాబాయినిచూపుచు] ఈమె నన్ను లోనికిదీసికొనిపోయి పాలలో నేమియో కలిపి యిచ్చినది.

[అందరు ఆశ్చర్యమునొంది రాధాబాయినిగ్రూరముగఁజూతురు]

రాధా—(వెళ్ళబోయి తల వంచుకొనును)

కన--[వ్రాయుట నభినయించి] న్యాయవాదులారా! మీవాదన ప్రతివాదములవసరములేదు. ఈనేరమునకు సారాంశమునువ్రాసి

నాను. మతిమంతా! ఈ విమర్శనఫల మీ యపరాధికి వినిపింపుము.
[కాగిత మిచ్చును]

మతి—[చదువును] ఈ యభియోగమున రాంజట్టి పెద్ద భార్యయగు రత్నాబాయి కుమారునకు దాసి మందుఁబెట్టినదనుట కొనఁగఁబడిన నిదర్శనము లెంతయుఁ గల్పితములై. యాక్షేపణార్హములై కన్పట్టినవి. ఈ దాసి దాసి కాదనియు, నొక యుత్తమాంగన యనియు, నీమెంజూచిన ప్రతిమనుజునకు బోధ కాకమానదు. ఇదియుగాక, దేవునివలె వచించిన యనంతుని వాక్యములే యీదాసిపైనున్న నేరమును దొలఁగించుట కత్యంతాధారములై యున్నవి. రాధాబాయి తా నీ నేరముఁజేసి, ఈ దాసిపైఁ బడవేయువలయుననియే యీ కల్పనముజేసినదనుట కింతమాత్రమును సంశయము జనింపకపోదు. అందుకు రాధాబాయి తడబాటుగల వచనమై పుణ్యమును, తన సవతియు, భర్తయుఁ జెప్పినటుగాక తా మొదటనుండియు నీ దాసిపై దుర్గుణములనే యారోపించుటయును దార్కాణము లగుచున్నవి. దుష్టశిక్షణ శిష్టరక్షణదక్షుం డగు భగవంతుఁడు కలఁడను నిదర్శనమునకు చచ్చిపోయిన గ్రీష్మునకుఁ బునఃప్రాణములు గలిగెనా యనునట్లు గ్రీష్ముఁడు విషజేతయై వేదవాక్యములవలె నించుకంతయైన ననుమాన మెవరిమనంబులయందును గలుగకుండునట్లు జరుపఁబడిన వాస్తవ మెఱింగించినాఁడు కావున నిందుల రాధాబాయియే శిక్షార్హురాలని నిశ్చయింపఁ బడినది. చంపవలెనని నిశ్చయించి మందుఁబెట్టిన యీ రాధాబాయికి శిక్షాస్మృతి నిబంధనప్రకారము శిరఃఖండనముఁ గావింపను తీర్మానింపఁబడినది. (ఖుస్రూతో) ఖుస్రూ! దానిఁ దలవరులకడ కీడ్చుకొని పొమ్ము,

ఖుస్రూ—అరే చల్ బేచల్! (అని రాధాబాయిని యీడ్చుకొని పోవును)

కన—(తనలో) ఈమె నిజముగా దాసీకాదు. హా యమ్మ యేమోయని యొక యడియాస కలుగుచున్నది; అయ్యో! ఇఁక నెక్కడి మాయమ్మ! నాకనులముందఱనే సముద్రమున మునిఁగిన నాతల్లి బ్రతుకుటెట్లు తటస్థించును? నీటబడి చావక బ్రతికించు నా క్రూరుఁడింత కాలము మనఁజూచుటెట్లు? ఇది యసంభవము నాతల్లి

కాకున్నను ఎవరోయొకసుకుమారి. రాణివాసమునఁ బెరిగినదిగాని సామాన్యకాదు. అందుఁ బతివ్రతాలక్షణములు సూచింపుచున్నవి. ఎవరయిననేమి తెలిసికొనుట యవసరము (ప్రకాశముగ) అమ్మా! నేను కొన్నిప్రశ్నలఁ జేయఁదలంచితిని. ఉత్తర మీయకతప్పదు. నీ వెవరవు ? నాఁ డరణ్యమున నేటికి పొక్కుచుంటివి ?

కమ—అయ్యా ! దిక్కులేనిదాన నగుటచే.

కన—నీ కాత్మజులుగాని యాప్తులుగాని లేరా !

కమ—అంద ఱుండియుఁ బాపినినా కతన వారందఱుఁ గోలుపోయితి.

కన—ఎందుచేత ?

కమ—నా ప్రారబ్ధముచేత.

కన—(తనలో) హృదయమా ! త్వరపడకుము. (ప్రకాశముగా) నీ వెవరవో మఱుఁగువెట్టక నిజ మెఱింగింపుము. నా శక్తి కొలఁది నీకు మేలొనరించెద !

కమ—అయ్యా ! కాలుని దర్శనమునకు సిద్ధముగనున్న నా కేమిమేలు ?

మతి—మహారాజుగా రడుగుచుండ నెందులకు దాఁచవలయును? చెప్పిన నీ కేమి భయము ?

కమ—(తనలో) ఏల యీ ప్రభువు నన్నీరీతిఁబరీక్షింపవలయు ఒకవేళ నాబిడ్డఁడా! నిజమేమో! వాఁడేయైన పరీక్ష కేమికారణము ? ఏమియుఁ దోఁచదు. చెప్పక తప్పునట్లులేదు (ప్రకా) అయ్యా !ఏమని చెప్పుదు.

సీ. విమలమై త్రైలోక్య ♦ విశదంబునా రాచ
వంగడంబునను బు ♦ ట్టంగనేమి
రారాజు సద్ధర్మ ♦ రతుఁడని జనములు
పలికెడు విభు జెట్టఁ ♦ బట్టనేమి
దేవేంద్రవిభవమున్ ♦ ధిక్కరించుసుఖంబు
పతి సమేతంబుగఁ ♦ బడిననేమి
కులవృద్ధి బొనరించు ♦ కొడుకును గూఁతును
గని ముద్దుమురిపముల్ ♦ గాంచనేమి

కన—[వేగిరపాటుతో తనలో] హృదయమా! త్వరపడకుము. (ప్రకాశముగా) నీ కొడుకును, కూఁతును నేమయిరి?

కమ—తే. గీ. నేఁటి కందటిఁ గోల్పోయి నీటఁబడిన
చావురాక నే నిన్ని కష్టముల కొఱకు
బ్రతికితి జనమ్ము గ్రామమ్ము బాడువెట్టి
పోయినను చలింపని బొడ్డురాయిపగిది.

కన—ఇంకను అనుమాన మెందుకు? ఈపె నిశ్చయముగ నా తల్లియే? (ప్రకా) వారి నందటి నెట్లు గోల్పోయితివి?

కమ—దురాత్ముఁడగు నామఱఁది నాభర్తను జంపి నన్నుం గోర, నే నది సహింపకుండుటచే నా కొడుకును కూఁతును గూడ చంపఁబంపె. తదాదిగ నందటిని బాసి యిట్లిడుమలఁ బడుచుంటి.

కన—(వేగిరముగ లేచి) నీమఱఁది యెవరు? క్రూరసేనుఁడేనా ?

కమ—అవును.

కన—హా! తల్లీ! (యని కమలపయిఁబడి) పతివ్రతామతల్లీ! నేఁటి కింత దుర్దశపాలయితివా?

కమ—ఏమీ! నాకనకమేనా? హాపుత్రా! (అని కుమారుని గాఁగిలించుకొని) కులపవిత్రా! నీవు జీవించియే యుంటివా? తండ్రీ!

కన—అమ్మా! నీవాదుష్టుని చెఱవదలి యీదారుణదుర్దశ కెట్లు పాల్పడితివి?

కమ—తనయా! నాకష్టమునకు మేర లేదు. నీయప్ప యెట నున్నది, తండ్రీ?

కన—(తనలో) ఇపుడే యీసంగతిఁ జెప్పితినేని ప్రాణములు విడుచుట నిశ్చయము. (ప్రకా) తల్లీ! సర్వము తరువాత వచించెద. మంత్రీ! అమ్మగారి ననుచరించి లోనికిఁ గొనిపోవుటకు సేవకురాండ్ర బిలిపింపుము. మరియుఁ గ్రూరసేనునితో యుద్ధమొనర్చుటకు సేనల వెడలింపుము.

మతి—చిత్తము.

చతుర్థాంకము సంపూర్ణము.



శ్రీ

# కనకతారానాటకము

## పంచమాంకము

### 1-వ రంగము

[సేవకుఁడు ప్రవేశము.

సేవ—ఆహా! మా విజయసేన మహారాజుగారి జాడ దిక్కుతోఁచక పొక్కుచున్న రాణిగారి యవస్థఁ జూడలేక యున్నందులకు తోడుగా కనకసేన మహారాజుగారి తల్లి దుఃఖముఁ గూడ పొత్తు పడినదిగదా! పాప మాతల్లి దుఃఖముఁ జూచినచో నెట్టివారికైన నిలువెల్ల నీరై పోవునుగదా! ఆ తారాదేవిని దలంచి విలపించుటఁ జూడలేక యిట్లో యీవలఁ బడినాను.

[తెరలో]

కనకసేన మహీపతి సర్వసైన్య సమేతంబుగఁ గ్రూరసేనుని పైకిదాడి వెడలినారు. రాణివాసుల నతిజాగ్రత్తగఁ గాపాడుటకు పలుమారు నొక్కి వక్కాణించినారు.

సేన—(విని) ఓహో! బిచ్చపుకూటిలో శనైశ్చర మనునట్లు విజయసేన మహారాజువలె నెక్కడనైనఁ జిక్కువడఁడుగదా! నేనును సైన్యముతో నేగెదను.

[నిష్క్రమించును.]

## 2 వ రంగము—అరణ్యము.

[కనకసేనుని సేనలు వడచిపోయిన పిదప విజయసేనుఁడు, తారయు ప్రవేశము]

తార—అయ్యో ! మనగ్రామ మింకెంత దవ్వుండును ?

విజ—సమీపమునకు వచ్చితిమి ఇఁక కొంచెము శ్రమ ముము.

తార—(ముందుకు చూచి భయముతో) ఎవఁడో యిటులఁ రువెత్తుచు వచ్చుచున్నాఁడు.

విజ—(చూచి) వాఁడు మన యంతఃపుర సేవకుఁడు. వాఁ డిట్లు ఁగత మేమియో ?

సేవ—(ప్రవేశించి విజయసేనుఁ జూచి) ఆహా ! (అని తెచ్చు ి) ప్రభువుల వారికి జయము జయము !

విజ—సేవకా ! నీ వెచటికి పరువెత్తెదవు ?

సేవ—ప్రభూ ! కనకసేన మహారాజుగారు కుమారసేనుని పైకి ండి వెడలి పోవుచుండ వారిఁ గలసికొనఁ బోవుచున్నాను.

విజ—ఏమీ ! ఇచ్చటికి కనకసేనుఁ డెపుడు వచ్చినాఁడు ?

తార—నా సోదరుఁడే నా !

సేవ—(వినకనే) తా మేగిన తరువాత మన రాష్ట్రమునకు ారే ప్రభువులైనారు. నేఁడు వారి తల్లిగారగు కమలాదేవిగారుకూడ కస్మాత్తుగ నేతెంచినారు.

విజ—ఏమేమీ ! కమలాసాధ్వి క్షేమముగ నున్నదా !

తార—(సంభ్రమమున) తండ్రీ ! మాయమ్మను నీవు చూచి గావా ?

సేవ—(వినకనే) ఏమిక్షేమము ! వారి పుత్రికం దలఁచుకొని యూరక దుఃఖించుచున్నారు.

విజ—అమ్మా ! ఇఁక నాలసించ గిట్టదు. త్వరగా బోదము. సేవకా ! నీ విపు డేగవలదు మా వెంట రమ్ము.

సేవ—చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు)

## ౩ వ రంగము.

గిడ్డూ—(ప్రవేశించి) తోబా ! తోబా ! మహారాజ్ సచ్చిన సందిమాకీ యేం ముషికల్ తల్గిందబై రాత్ దిన్ బుగుల్ తోటీ మాపాణంవాడు సచ్చిపోయివుండాది. ఖానా, పానీ, నిదా), వదలీ యెప్డుజూచినా వక్టేబుగుల్ వక్టేబుగుల్. ఖుదూర్ సేన్ వాండు సేసే లుచ్చాతనానీకి. ఘుండెల్ సటాయించి పీన్ఖులాగావుంటే యియ్యాల యెవడో హాన్మింగేటోడు, సిబ్బందికి దీసొకవి నడి ఝూంఖాడా పహరుకూ గిరప్తార్ సేసి, తోఫ్, ఫిరంగి; బందూఖులు వుడాయించుకుంటూ, ఢాన్, ఢాన్ అని నగారా బజాయించుకుంటూ వుంటే సెవుల్ అంతాపల్గీ వల్గీ ఘుబరాట్‌తోటీ సచ్చి హిక్మత్ సేసి యెఖ్డానున్నా భరాయించుదామనుకుంటే యెఖ్డాజూపినా సిబ్బంది భరాయించి సేతులా బందూఖుల్ పట్ఖొని తయ్యార్ పడి ఘూసుండార్. నాదీ నసిబ్ తల్గాబడిపోను, యెఢ్డాజూసినా పానమ్మినా తయ్యార్.

[తెరలో]

ఉ. క్రూరుఁడటంచుఁ గొంటెరదఁ ♦ గుందుచు, దిట్టఁగఁగన్ను మెచ్చు వా
  ధూరకవర్ణనల్ పలుప ♦ నుబ్బుచు గాలవిధిన్ జనమ్ములన్
  ధీరత నాక్రమించి పస ♦ తీరెడు కాలము రాగ సైన్యముల్
  బారగ వెల్లఁబోయి కళఁ ♦ బాసి సుధాకరుఁ డేగుచుండెడిన్.

గిడ్డూ—(ఆలించి) అరే కోన్ హైరే మాది సెల్పొద్దూపేమునికి హెంత సులకంగజూచి మాట సేస్తావుంటాడు. (ప్రక్కకుజూచి) అరే వాడు యెవ్డాబే ?

కంచుకి—(ప్రవేశించి) ఎవ రిచట ! (గిడ్డూనుచూచి) గిడ్డూ! యిచట నున్నావేమి ?

గిడ్డూ—(కోపముతో) అరే గిడ్డూ లేద్ బుడ్డూ లేద్ అరే, నువ్వా యెవ్వావోయ్ ?

కంచు—ఏమోయ్ కోపముతో నున్నట్లున్నావు? నీవు నన్నెఱుగవా ?

గిడ్డూ—అరే, ఖోపం గీపంతో నీకీయేం, నువ్వ యెవ్డాయేద్వరాద్.

కంచు—ఓహో! ప్రతిమాట సంబోధనలో, అరే, యను చున్నఁ గులభాషాదోషముగదా యనుకొంటిని రాను రాను శ్రుతి మించి రాగమునఁ బడినదనుట కిదే ప్రమాణము చున్నావే.

గిడ్డూ—అరే! నీకీ యింకా యేమనాలా బే?

కంచు—అదిగో మఱల బే యేమిటి?

గిడ్డూ—అరే నువ్వప్డూ గూసింది యేంటి?

కంచు—ఎప్పుడు?

గిడ్డూ—అరే నువ్వొచ్చేతప్డు.

కంచు—(స్వ) వీనికేమైన వెఱ్ఱియా? (ప్రకా) నేను వచ్చేట ప్పుడు నిన్నేమన్నాను చెప్పరాదా?

గిడ్డూ—అరే నన్ను అనక పోతే, అందరీకి అంటా?

కంచు—నిన్ననకపోయినతరువాత నీకేమి? అయిన, నేనెవరి నే మన లేదే?

గిడ్డూ—అరే! నువ్వ యెవ్వరికి యేమనా లేదు?

కంచు—లేదు.

గిడ్డూ—అరే నువ్వొచ్చేతప్పుడూ, మాదీ నెల్పొడూ ధేముడికి యెంత సులకంగ మాట సెప్నె బే?

కంచు—ఓహో! ఇదియా నీ క్రోధమునకు మూలము, సరే గాని, యిఁకనైన సంబోధనలో మాత్రము; అరే, బే, యనుటలు మానుము.

గిడ్డూ—అరే, అది అట్లా పెట్టు. మా ధేముడీకి అనటానికి నువ్వ యెవదాబే?

కంచు—అదిగో! నిన్నదే వద్దన్నది. మీకుల మేమి కులమో గాని ప్రతీవాఁడు, అరే, బే యననిది మాటాడ రేమిటోయ్?

గిడ్డూ—అరే, నే నడ్గింది యిడ్చి, నువ్వొకటీకి దెస్తావు, దానికి జెప్పు.

కంచు—మీదేవుని చులకనవిషయ మేనా?

గిడ్డూ—హా.

కంచు—మీదేవుని విషయ మంతయే.

గిడ్డూ—అరే, యెందుకీకి బే?

కంచు—(తనలో) ఈమూర్ఖుని నీహీనప్రపంగ మెట్లుమరపింతును?

గిడ్డూ—అరే! మెందులీక్, అంటే ముద్దులాగమాటసెయ్యా?

కం—అందులకే.

గిడ్డూ—అరే! మాతోటీ రట్టాసేస్తవు?

కంచు—తట్టకాదు బుట్ట.

గిడ్డూ—అరే! మే మడ్గిండి తట్టల్ బుట్టల్ ఖాడిక్ దిగిందీ?

కంచు—లేకున్న నింకేమి? నిశ్చయముగ మీదేవుఁడు చులకన జేయఁ దగినవాడే?

గిడ్డూ—అరే మాదేవ్రుడూ? అయితే మీదేవుడూ కాదుబే?

కంచు—మాదేవుఁడా? అటుచూడు

ఉ. తా నటు క్రుంక, లోక విభుఁ తం గొని యుద్ధమొకండు లేక, యెం
తేనియు మిన్నుముట్టిన ప్రహింపక వైరముఁ బూని యిప్డు మా
భానుఁడు స్వీయతేజ మను పన్గమలాదులు నవ్వుచుండ స్వ
హీనత నాక డిల్లఁబడి యేగెడు మీశశితీరుఁ జూచితే.

మా దేవునిరాక తెల్పుచున్న యా దివ్యతేజమును ప్రాగ్దిశం గనుఁగొనుము. ఆతేజమే మీ దేవుని వెల్లబోఁగొట్టి పశ్చిమవార్ధిఁ బడునట్లు పాఱఁదోలుచున్నది. ఇంక మాదేవుఁడే యేతెంచినచో మీదేవు డేమైనఁ గళానహితుఁడై నిల్వఁగలడా? ఇట్లు తెల్లమొగము బడిన మీ దేవుఁడు చులకన కెట్లు తగడు?

గిడ్డూ—(తనలో) అరే, అల్లా! యీడు ముసిల్దివున్నాడుఘానీ హెంతహిక్మత్ నేర్సినాడ్రే, హీనిక్ జరా నాహిక్మత్ ఘూడసూపిస్తాన్; (ప్రకా) అరె కంచుడయా!

కంచు—అప్పటినుండి నీ వెవరని వన్నడుగుచుంటివే? ఇప్పుడు నాపేరెట్లు తెలిసినది?

గిడ్డూ—అరే, అది పోనీ మీదేవ్డూమాధేమునీక్, యెల్లఘొట్నాడన్నదా నువ్వు సెప్పింది. మల్లామాపటిక్ మాధేవ్డూ వచ్చి మీధేమునీక్ మొఖమిన్నాదాఖొట్టి యెల్లదన్నేతడ్పూ నీమొఖం యెక్డాబెట్టుకుంటా బే?

కంచు—మీ దేవుఁడిట్లెన్ని రాత్రులవరకు రాఁగలఁడు? అమావాస్య నా డేమూలల గాజులుఁ దొడిగికొని కూర్చుండును?

గిడ్డూ—అరే పిచ్చీ మన్సీకి నీకీ ఏంతెల్సు, హంరోజు మీ ధేమునికీ ఖొట్టి, ఖొట్టి, బేజార్పడి, హాల్సీ హాల్సీ, మాధేమ్ము హమాన రోజ్ ఆరాం తీసోకనీ హవాఖోరీ సెయ్యంటానికి యింటిఖాడా వుంటాడ్చే.

కంచు—ఏమీ! మీదేవున కలసటా! మాదేవునికట్టియలసట యెన్నఁడైన గలదా?

గిడ్డూ—అరే మీధేమ్డూ మొద్దుమన్సీ ఘనకీ దివానాలాగ యెప్డూ దిరుగుతావుంటాడ్, అందుఖోసరనేకీ, మాతురకీఖులం అంతా మాదేవునీకీ మొక్కేతప్డూ మీధేమునీకి మొఖుం ఘూడా సూడం.

కంచు—అందులకే మీరు మీదేవుడునంత చులకనయ్యె చూచితివా? మీదేవుడు పాఱిపోయి సముద్రమున డాగినాడని యది వరకుఁ దన్నావరించిన క్రోధసంబంధారుణ మిపుడిపుడు వదలిపోవుచున్నది. ఇట్టి దివ్యతేజుఁడగు మాప్రభాకరునకు నీవేమైన వంక తేగలవా?

గిడ్డూ—అరే మీదేమునీకీ వంకాలేదువోయ్!

కంచు—మాదేవుఁడు త్రిమూర్తి స్వరూపుడు, కర్మసాక్షి; ఆ దేవునకు వంకదెచ్చువా రెవ్వరు?

గిడ్డూ—అరే, బాప్రే! (నవ్వుచు) మీదేవునీకీ వంకాలేదువోయ్. మీధేమునీకీ హెంకాతల్లి పజంతా బేజార్తోటీ మీధేవునీకీ నచ్చేతట్లు తిట్టుటలేదువోయ్, మాధేమునీకీ హెన్నెలల్లాసేతప్డూ హాయ్, హాయ్, అని ఆరాం తీసోకని పజంతా మాదీధేమునీకీ తారీఫతోటీ. సోకం పెద్దం, పాటల్ ఫాడేది. దివానాకీ నీకీయేం తెల్సు.

కంచు—ఔను! ఆపిచ్చి పద్యములు పాటలంతగాఁ బాడుటలేదుగాని వేదములు మాత్రము మాసూర్యునిఁ బరబ్రహ్మముగా నుతింపుచున్నవి.

గిడ్డూ—అరే, నీయాధం గీథం యెవనీకీ తెల్సుబే.

కంచు—ఛీ! యీ మూర్ఖునితో నాకీనాఁ డిట్లు సంవాదము ఘటించినదేమి?

సులో-(ప్రవేశించి)ఎవరచట! తాతా! నీవిచట నేయున్నావా?

కంచు—సులోచనా! సమాచారములేమి?

సులో—అయ్యో! నీకెఱుఁగవా? క్రూరసేన కనకసేనులకు ద్వంధయుద్ధము జరుగుచున్నది.

గిడ్డూ—ఆఁ ఆఁ అరే అల్లా. (అని తెల్లబోవుచున్నాడు)

కంచు—కనకసేనుఁ డెవరు?

సులో—మన యుదయసేనభూపతి సుతుఁడు.

కంచు—కనకసేనుఁడు బ్రతికియున్నాఁడా? ఇపుడుయుద్ధమా, రాత్రినుండియు నేనెవరో పరరాజని తలంచుచున్నాను. బాలుఁ డయ్యు నింతసైన్య మెట్లు సంపాదించినాడు?

సులో—ఆవిమర్శనము జక్కగా నేనెరుగను.

కంచు—అయిన యుద్ధప్రశంసలేమి చెప్పవైతివి?

సులో—చెప్పినగాదు, చూచినగాని తీరదు.

కంచు—ఇప్పటి కెవరిసైన్య మెంతరూపు మాసినది? ఎవరికి జయలక్ష్మి యభిముఖురాలై యున్నది.

సులో—ఎవరు ధర్మవర్తనులో వారికే జయలక్ష్మి యభిముఖురాలు. వీరపాల శూరపాలాది వీరసహితముగ సైన్యంబంతయు రూపుమాసినది. ఒంటరివై క్రూరసేను డిపుడు ముష్టియుద్ధ మభిలషించుచున్నాడు.

గిడ్డూ—(తనలో) అరే అల్లా మేరే జాన్ కైసా బచానా.

కంచు—ఔను క్రూరకర్ముల కెప్పుడును జయలక్ష్మి దూరస్థయే యగుగదా.

[తెరలో]

శా. సేనానాథు నమాత్యుఁ జోరవిధిచే ♦ జీవంబుల న్బాపుటో
భూనాథు న్నిదురింపఁ జావమనక ♦ న్బోనార్చుటో లేక య
జ్ఞానాంధమ్మున నాథు బాసిన మహా ♦ సాధ్వీన్ జెఱంబట్టుటో
హీనా! కాదిది నాదుముష్టిహతి ని ♦ న్నిల్గించురా యాత్రుటిన్.

గిడ్డూ—(భయముతో) అరే కంచుడయా! హాంకూ జరా బచావ్. తేరా పాం పట్తాహుం.

కంచు—అప్పటినుంచి ని న్నావహించియున్న శౌర్య మెచట పాఁడైనది? నీ సమయాచిత వర్తనమునకు మెచ్చవచ్చును.

సులో—తాతా! మన మిట నుండతగదు. పోదమురమ్ము.

(అందరు నిష్క్రమింతురు)

4 వ రంగము

(క్రూరసేనుఁడు కనకసేనుఁడు, ప్రవేశము)

కన—శా. సేనానాథు నమాత్యు (అను వెనుకటిపద్యముఁ జదువును)

క్రూర—ఓరీ! వాచాటా! డింభకా!

ఉ. వారిని వీరినిం దలఁచి ♦ వాగెదు వెఱ్ఱివిధాన మద్భుజా
స్ఫారితబంధనుధ్యము న, ♦ జావక నిల్వవము నీవుఁగూడ నీ
వారిఁ జేరుకాల మిదె ♦ వచ్చెను సు మ్మెవనాఁడె తప్పె నా
కౌర యిఁకేడఁ బోయెద వ ♦ హా యురిఁ జిక్కిన పక్కివై పడిన్.

కన—ఓరీ! దుర్మదాంధా? సదాలోకాపకారచింతాస్వాంతా!

ఉ. ధర్మముఁ బాడుఁ జేయుచు న ♦ ధర్మమె వృద్ధినిఁ బొందునట్లు దు
ష్కర్మము లాచరింపుచు జ ♦ గంబునఁగల్గు మహానుభావులన్
బేర్మి వహింప కెంతొ శ్రమఁ ♦ బెట్టుచునుంటివి క్రూరబుద్ధి నిన్
మర్మముఁదూలఁ జక్కడచి ♦ మాన్పెద నెల్లరు నొందుబాధలన్

క్రూర—ఆహా! ఏమిరా నీ డాంబికపటాటోపము.

ఉ. పాపఁడ వీవు నన్నుఁగెడ ♦ పం దలపోయుచు నిక్కి చీవుఁ గా
దీపదునాల్గు లోకముల ♦ నెవ్వఁడు న న్నెదిరింపఁగల్గు రా
రాపిడిగుద్దు చేత నిను ♦ రక్తము గ్రక్కఁగఁ జేతు బాపమాం
చోపికఁ జేయుచున్న భయ ♦ మూనవు నీమదమున్ హరించెదన్.

కన—(పరిహాసముగ) వరాశరాసన ఖడ్గాది దివ్యాయుధము లుండ నందు నీకు ఖడ్గమే ముఖ్యసాధనమై యుండ పిడిగ్రుద్దులమాటఁ దలపెట్టనేల? ఉదయసేన మహీపతి బ్రతికియున్న కాలమున నీ వ్రాక

ముండవలె పిండముఁ దినుచున్నప్పుడే ఖడ్గమును విడువనట్టి నీ విపుడు భిక్షము వసపించుకొను సమయమున యాయుధము నేల విడుతువు? లోకులు నగరా, హీనుడా!

కూ౯ర—పసివాఁడవు ప్రయోగోపసంహారముల నించుకైన నెఱుఁగవు ఒకవేళ నే సమ్మతించినను, ప్రాజ్ఞు లధర్మ మందురు; పోగ రేకిఁ కన్నుమిన్నుఁగానక సమర మభిలషించి నాఁడవు. కావున, నీ పొగరణఁగువఱకు పెనంగి పంపుద మనుకొనుచున్నాను. చేత నైన నీయఁకొనుము. లేకున్న శరణనుము.

కన—ఔరా! ఏమి నీ ధర్మవర్తనము! కానిమ్ము! నీ యిష్ట మేల కాదనవలయు? (చూపుచు) ఆస్థలమునకేగి, ప్రతాప భుజబల ములఁ గన్పరిచి కొందము. (అనిచేయిఁబట్టి లాగికొనిపోవుచు)

[ఒకరథముపైఁ గూర్చొని విజయసేనుఁడు, కమలా, తారలు ప్రవేశింతురు]

కమ—(విజయసేనునితో) అయ్యా! దైవానుగ్రహమున, కాకతాళీయముగ నాసుతుఁడు కనుపించినందున కొకదినమైన నాబుద్ధి దీఱఁ జూచుకొనుటకు లేక యుద్ధ మొకటి సంభవించెఁగదా! శత్రు వుఁడతిదురాత్ముఁడు, జయాపజయములు దైవాధీనములు, నామనం బేమో వేగిరపడుచున్నది, రథము వేగముగఁ బరపించి నాసుతునిఁ జూపుము తండ్రీ!

విజ—అమ్మా! ఇదే సమీపించుచున్నాము, చింతిల్లకుము.

(తెఱలో కలకలానంతరమున)

తే. గీ సకలజనముల బాధలు ♦ సమసిపోవ
ధర్మ మభివృద్ధియగుటకు ♦ దారి కలుగ
కురువిభుఁడు మున్ను భీముచేఁ ♦ గూలినట్లు
గూలెదవు నీవు నాపిడి ♦ గుద్దుచేత.

అందఱు—(ఆలించి) ఎవరోగదా?

విజ—(ముందుకు చూచి) అమ్మా! మీ రిచటనుండుఁడు. అదిగో యా ప్రదేశమున, క్రూరసేన కనకసేనులకు ముష్టియుద్ధము జరుగుచున్నది. నేను మన కనకసేనునకు సహాయ మేగెదను. (సార థితో) సారథీ! జాగ్రత్తగా నుండుము.

తార—చిత్తము.

విజ—(నిష్క్రమించును.)

తార—అమ్మా! ఇపుడు మన కేమి కర్తవ్యము?

కమ—మన కీశ్వరధ్యానమే కర్తవ్యము? (కనుమూసి కొంత స్మరించి)

తే. గీ. నావిభుఁడు ధర్మపథమున ♦ నడచెనేని
నేను పరమపతివ్రత ♦ నేని మాకు
సర్వకష్టముల్ నేఁటితో ♦ సమయఁజేసి
నాసుతుం డరిఁ దోలి రక్షఁ ? గాంచుఁగాత.

3946S
20-1-90

విజ—(క్రూరుని జుట్టుఁబట్టుకొని యీడ్చుకవచ్చుచు)

తే. గీ. దుష్టుఁడా! నీచుఁడా! గురుద్రోహి! యీసు
శీలయగు కమలాదేవిఁ ♦ జెఱఁబట్టి
నట్టిదా పాపచయము మింక ♦ గట్టి కుడుప
కూరకయె నిన్ను విడుచువా ♦ క్రూరసేన!

కన—(ప్రవేశించి ఖడ్గధరుఁడై) ఎవరు వానినీడ్చుకపోవువారు?

కం. ఎదురంగ లేక దొంగయి
నిదురించిన నాజనకుని నిర్జించిన దు
ర్మదు మత్ఖడ్గమునక్ శిర
ము దరిగెదన్ జనకుని ఋణ ♦ ముం దీర్పంగన్.

క్రూర—(పట్టు దప్పించుకొని భయముతోఁ గమలాదేవి-పదములఁబడి) తల్లీ! అపరాధిని, రక్షింపుము. రక్షింపుము.

కమ—(విజయసేనునిఁ గనకసేనుని వారింపుచు) అయ్యా! తాళుము, తాళుము. కుమారా! శాంతింపుము. శాంతింపుము.

కం. అపకారి మనకు జగమున
కపకారికి శిక్ష మఱల ♦ నపకారముగా
దుపకారం బపకారికి
యుపకారమె శిక్ష యనఁగ నుర్విన్ వినమే.

ఈతఁడెంతటి క్రూరుఁడైనను ప్రస్తుతము ప్రాణభీతిశరణుజొచ్చి యున్నవాఁడు. శరణాగతరక్షణము క్షత్రియుల కవశ్యము కర్తవ్యము. క్షత్రియులే యననేల? దయార్ద్రచిత్తు లందరికిని కర్తవ్యమే కావున

నాయుపదేశంబుం ద్రోయక వేఱొక ద్వీపమునకుం బంపివేయుఁడు. పిదపఁ దన క్రూరకృత్యమునకుఁ దానే పశ్చాత్తప్తుఁ డగుఁగాక!

తార—(తనలో) ఆహా! మాతల్లి కేమియోపికగాని నాకు వీనిఁజంపినను కోపము పోనట్లున్నది.

విజ—(తనలో) ఆహా ఉత్తముల లక్షణము లిట్టివే కదా! కాని యీక్రూరుఁడు చంపక విడచువాఁడు కాఁడు. ఈ సుశీలయాజ్ఞ దాఁటుటకు వీలులేదు.

కమ—అయ్యా! ఇఁకనైన దుర్గుణముల విడచి, సుఖముగ మనుము; పాదముల విడచి లెమ్ము.

విజ—(క్రూరుని లేవఁదీసి) ఓరీ, లోకద్రోహీ, క్రూరసేనా! యింకనైనబుద్ధిదెచ్చుకొనిసన్మార్గమవలంబింపుము. (చెంపలువేయును)

కన—(క్రూరునితో) నీ వికఁ నీద్వీప మెపుడుఁ జేరినను మద పుటేప్పుకాలఁగట్టించి యూరేగించెదను. మతిమంతా! ఏడీ మతిమంతుఁడు? (చూచి) ఓహో! సైనికులఁ గొనివచ్చుచున్నాఁడు. సేవకా! వీని గొనిపోయి మతిమంతున కొప్పగించి యన్యద్వీపమునకుఁ బంపున ట్లొనర్పుము. [క్రూరుని మెడఁబట్టి త్రోయును]

సేవ—చిత్తము. [అని క్రూరు నీడ్చుకొని పోవును]

కన—[తల్లికి నమస్కరించి] తల్లీ! నీ విచటి కెట్లు వచ్చితివి?

కమ—తండ్రీ! [విజయసేను జూపుచు] ఈ మహారాజు తోడి తెచ్చెను. కాని మన పూర్వ పుణ్య విశేషమునఁ గష్టము లన్నియుఁ దీరినవి. జనకుని ప్రియమిత్రుఁడగు నీ విజయసేన భూపతికి నమస్కరింపుము.

కన—[ఆశ్చర్యమున] ఏమీ! విజయసేన భూపతియా! అయ్యో! అప్పటినుండి క్రోధావేశపరవశుఁడనయి మిము గుర్తింపకున్న నాయపరాధము క్షమింపుఁడు. (నమస్కరించును.)

విజ—[కౌఁగిలించికొని] కుమారా! నీకు సర్వవిధముల మేలగుఁగాక.

కన—అయ్యా! మీ రిచటికి విచ్చేసి యెంతతడవైనది?

విజ—ఇపుడె, తారాయుతముగ మీ తల్లిగారిం దోడ్కొని వచ్చుసరికి మీ యిరువురి ముష్టియుద్ధ మభివృద్ధి యగుచున్నది.

కన—ఏమీ! తారయా! మాయప్పయేనా! యేదీ! [తారను కౌఁగిలించుకొని] అయ్యో!

తే. గీ. దాహపీడితవై తెల్వి ♦ దప్పిపడిన
నీరములనైనఁ దేలేక ♦ నిన్ను మరల
వెదకి కనలేక వనమున ♦ విడచి రాజ్య
మేలుచున్న నిర్దయుని క్ష ♦ మింపుమమ్మ.

తారా—(శేషున్నిఁ గౌఁగిలించుకొని) నాకర్మమునకు నీవేమి చేయగలవు. ఘోరారణ్యమున నిను వెదకి వెదకి నీ వెంత గాసిఁబడితివో యని నాటినుండి కుందుచున్నాను.

కన—అప్పా! నీ దాహ మెట్లుతీరె! నీ వెట్లు బ్రతికితివి?

[సేవకుఁ డొకఁడు ప్రవేశించి]

సేవ—ప్రభువులకు జయము! జయము! ఋషివరులు కొందరెవరో మిమ్మాదరణిఁ దోడ్కొని రమ్మనినారు.

విజ—కుమారా! ఆమె వృత్తాంత మతి కష్టమైనది తదుపరి చెప్పెదను. ఆమహానియు లెవరో పోయి కనుగొనెదమా!

కన—(సేవకునితో) ఆఋషు లెవరు?

సేవ—మీ కరణ్యమున నెపుడో శుభ ముపదేశించిరట.

కన—(వేగిరపాటుతో) అట్లైన మన మంకఱ మేగి వారిని దర్శింపవలయును.

అందఱు.—మంచిది. [అందరు నిష్క్రమింతురు]

4 వ రంగము పట్టాభిషేక మందిరము

(విజయసేనుఁడు, మతిమంతుఁడు, కంచుకి, ఋషులు కొందరు పౌరులు ప్రవేశము)

విజ—అయ్యా. నీతండ్రి గతించిన నాటనుండి దిక్కుమాలి పోకుచున్న యీలోకులఁ బాలింపుము. (అని సింహాసనము దగ్గరకుఁ దీసికొని పోవును)

కన—(కన్నీరిడుచు) ఆహా! ఇట్టిమహోత్సవము నాతండ్రియే నెరవేర్చిన నెంత యానందముగ నుండునోగదా! అట్టినోము నోచుకొననైతి.

విజ—అయ్యా! గతించిన కష్టములఁ దలించి చింతిల్లకుము.

కన—అయ్యా!

క. వెనుకటి కష్టములను నా
మనమెట్టుల నెంతలోన ♦ మరువఁగల దహో
తను వోకచోఁ గాలిన నే
ర్పున నీళ్ళనుజల్ల మంట ♦ పోవునె చెపుమా!

ఋషు—వత్సా! ఇట్టి మహోత్సవ సమయమున సంతోష, ముననుండవలయుఁగాని చింతిల్ల తగదు; ఇంక వేళ తలంపక సింహాసన మధిష్టింపుము.

విజ—(కనకసేనుని సింహాసనముపైఁ గూర్చుండబెట్టును)

ఋషు—కుమారా! ఈసమయమున నీ యభీష్టములఁ గోరుకొనుము.

విజ—అయ్యా! మహాత్ములారా! ఇట్లగుగాక.

తే. గీ. బాలురై తలిదండ్రులఁ ♦ బాసి సకల
కష్టముల కోర్చి విజయముఁ ♦ గాంచినట్టి
కనకసేనుఁడు దారయు ♦ ఘనయశమున
దనరుదురుగాత మాచంద్ర ♦ తారకముగ.

అందఱు—తథాస్తు,

కన—ఈశ్వరానుగ్రహమున నిప్పటి కేకొఱతయు లేదు. అయినను నిట్లగుగాక.

తే. గీ. క్రూర జార చోరుల బుద్ధి ♦ మారుఁగాక
పరసతులు తల్లు లనువృత్తి ♦ వరలుగాక
నీతిగలరాజు లిలను జ ♦ నింత్రుగాక
లేమి లేమియై సంపదల్ ♦ నిలచుఁగాత.

అందఱుతథాస్తు. (అందరు నిష్క్రమింతురు)

( మంగళము. )

గద్య—ఇది అష్టావధానియు, విద్వత్సేవాధురంధరుఁడునునగు
చందాల కేశవదాస విరచిత కనక్తారా నాటకమునఁ
బంచమాంకము
సంపూర్ణము.

# కనకతారానాటకానుబంధములు.

1 వ అంకము—1 వ రంగము—7 వ పుట—1 వ పంక్తి.

1 ఊద— పాట,

ఈ పరితాపము నెటులబాయుదునో ॥ఈ॥ దాపురించె దురాత్ముఁడు, నాసోదరుఁడు నాపాప, వశమునన్ ॥ఈ॥

చరణము॥ పరతరుణులఁ గడు బలిమినిఁ గైకొని తిరుగుచు మెలగుచు నుండున్, యే, తరిని మధువు గ్రోలుచు నొడలెఱుఁగక, నిరుపేదలఁ గడుఁజెండున్, భూ, సురవరులను సతతము దూరుచు నఘకరుఁడనఁగఁ బరఁగుచుండున్, అరయఁగ లోకంబున కలుకారి, సుజనారి, మితిమీరి ॥యీపరితాపము॥

---

1 వ అంకము- 1వ రంగము- 11వ పేజీ- 5వ పంక్తిలో బూడిదలో వేసిన యాహుతివలె నిరర్థకముకాలేదా అనుమాటపిదప.

2 ధీమం— పాట

ఎంతయాలోచనమూ, స్వాంతమున జేసినన్, సుంతయైన ఫలము లేదూ, వసుధేశా ॥ఎంత॥ అనుపల్లవి॥ ఎంత యనుభవముఁ జూపిన నెన్ని ధర్మములఁ జెప్పిన, పంతమేమొ తనదు మదినీ, బాయ నిచ్ఛగింపడూ ॥ఎంత॥

చరణము॥ ఏటికి నీరుజల్లినట్టులా, వృక్షములకుఁ బండ్లిడినట్టులా, ఖోటికి రంభను గట్టినటుల, పుట్టంధునాకద్దమిడినట్టులా, కాటికి బోయిననాఁడె తీరవలె నీతమ్ముని దుండగముల్, ముమ్మాటికిఁ, వీటికిన్ జేటులా ॥నెంతయాలోచనమూ॥

---

1వ అంకము- 1వ రంగము- 15వ పేజి 24వ పంక్తిలో (తనలో) ఆఁ ఆఁ పిదప

2 క్రూర— పాట

ఖలమతీ! నీదుగతీ నిక సూపెదనురా॥ పొగరున నిటుపలికితివహా ॥ఖ॥

అనుపల్లవి॥ ననుఁజులకఁదనమున న్గనుగొనినీ! మనమున భయమావంత యయినన్॥

చరణము॥ గొనక మెలఁగుడిపుడునాను। గుణగణంబు పిదపఁ దెలియు
జననగగా। పిరికివిగా। నరకుడుగా। యెరుగవుగ ॥ఖ॥

1వ అంకము- వ రంగము- 18వ పేజీ- 21 పంక్తిలో
మాలోచింపుడు పిదప

4 ధీమ—— పాట

అయ్యా యిక మోసమగును। యాలసించిన ॥అనుపల్లవి॥ చయ్యాన
నేదియో యొక యోచనసేయగఁదగుఁదడయగ॥నమృతంబు
విషమగు ॥నయ్యా॥

చరణము॥ (ప్లేర్) ఊరకున్న కొలంది నానాటికిన్ । యుత్పాతముల
దెచ్చుమనవీటికిన్ । క్రూరసేనుడిట్టులుండ నేనొల్లక । గృశి
యించిరి దుర్బలులెల్లన్ । భూరమణా యెట్టులో చేసి। పోవ
జూడ జనులగాసి। క్రూరకర్ముఁడు నీదుతమ్ముఁడు।కుత్సితుండు
గావుననయ్యా యిక మోసమౌను॥

1వ అంకము- 2వ రంగము- 21వ పేజీ- 33వ పంక్తిలో
నిశ్చింతనుండుడు పిదప

5 వీర—— పాట

వీరలుకారిఁక । వేలుభుపీశ్వరు । లేకమైజనిన। గానీ ॥వీ॥ అ॥ అరిజన
విజయుండటంచుఁ గడుయశ॥ మవనిగనిన మీకిఁకేకొంత॥వీ

చరణము॥ పదగజములు గడు। మశకసమితిచేరి। కదపగ నిల గను
గొంటిమెమీ॥ హృదయ కమలమున నింతకలంగఁగ। సద
మలచరితా సరియగునా ॥వీ॥

1వ అంకము- 3వ రంగము- 27వ పేజీ- 24వ పంక్తిలో
రానికారణమేమయ్యెండును పిదప

6 కమ—— మోహనరాగము - ఆదితాళము

ఏలరాడు ప్రాణేశుఁడిటకు నే । జాలమేలసేసె ॥ యేలా ॥
ఎన్నడిటులఁ దడయు లేదు కారణ। మేమొ తోచకున్నది
మదికి। నన్ను తాంగుడిటకూ ॥యేలా॥

1 వ అంకము ౨వ రంగము ౨9 వ పేజి 11 వ పంక్తిలో
బ్రాకెటు పిదప

7 ఉద— పాట

సోదరా యింతఁజేసితివిరా ॥సో॥ అ॥ నీ దుర్మార్గము జూపగా నేటి
కీ సాధులే, కన్నుల కగపడిర ॥సో॥

చరణము॥కటకటా, యెన్నఁడే! గానినీ, కుటిలతా, నొంచనూ, తటు
కున నిటుచేసితివ ॥సోదరా॥

1వ అంకము ౩వ రంగము 30 వ పేజీ 6వ పంక్తిలో దెలుపుడింక పిదప

8 కమ— పాట

ఈగతినుండఁగా యీ ॥అ॥ తగిన కారణమేమికలను వనజనయనమదన
మోహన ॥యీగతి॥

చరణము॥ ఇంతటికారణ మెవరివలనఁ, గలిగె దెలుపు సుగుణసదన,
చింత నొందనేల నేనుగలుగగ, యింతవంతయేల, నీ విటుండ
నేల, వసుమయచేల, వరబలా ॥యీగతి॥

1 వ అంకము 3 వ రంగము 32వ పేజీ 2 వ పంక్తిలో
నిశ్చయము పిదప

9 ఉద— పాట

ప్రాణసములు అభిమానధనులు గడు, మాననీయు లఘుదూరుల్ నా॥
ప్రా ॥అ॥ సుజ్ఞానచిత్తు లసమానబలగుణ నిధాను లానయాత్మ
లబ్జనేత్రి ॥ప్రాణ॥

చరణము (పైన్) సరోజవిహీన కాసారంబురీతిన్, సరసిజాపశశాంక
రహిలోకంబుభాతిన్, విరినికరభావలతా వితానఖ్యాతిన్,
వివృతమంత్రీయుత భూపాలకుండనైతిన్, ఏమిసేయుదును,
యెటులభరింతును, నా మనం బెటులనిలచును సకియా ॥పా॥

శ్రీ

1 వ అంకము 3 వ రంగము 33 వ పేజీ 3 వ పంక్తిలో
నయ్యోదను పిదప

10 కమ— పాట

అయ్యో యిటు లశుభములగు మాటల నాడ గాదగునా ॥అ॥ అను॥
ఇయ్యెడ మీపుది కేలభయంబూ, యేనుంగలుగంగా మీ కన
యంబూ ॥అ॥

చరణము॥ దేహమెల్లఁగృశియింప, గ నుదిసుస్థిరంబుఁ జెడియిటులదీన
తన్, దోహదములను విడనాడియిప్పుడే, దో యొక చింతను
బొందుటెగాక నా, ద్రోహుఁడు మిముఁన్, సాహసమునను దు
రూహఁజంపునని తలఁపకుడీ మి, మ్మాసాహవమున నెదురింప
సమర్థుఁడె ॥అయ్యో॥

---

1 వ అంకము 3 వ రంగము 34 వ పేజీ 8 వ పంక్తిలో
జనకా పిదప

11 కన— పాట

మనసచివుం దునిమినటం చని వినగన్, మదిఁగనలెన్, అనఘులగు
నవ్వారినిం దునిమిన యాపాపినిన్, కోపినిన్ క్రూరునిన్,
జోరునిన్ ॥మ॥

చరణము॥ ఇంకవిడిచి నెన్నెన్ని దోసగులు, నెన్ని మరణము, లెన్ని
యాపదలు రానున్నవో, నీకుఁదమ్ముఁడని దయ, దలఁపఁదగ
దిక, తగినటు లరయుము ॥మన॥

---

2 వ అంకము 1 వ రంగము 37 వ పేజీ 5 వ పంక్తిలో యనుపిదప

12 గిడ్డూ, కంచు, డైలాగ్ పాట

గిడ్డూ—తేరే, ఖాలీకీ పడ్తాం. మీకీ సలాంపెడ్తాం ॥తే॥ అను, నీ
జోలీకి-జికిరీకి- నీపేరీకి- రాం రాం రాజానీ ॥ఖాలీకీపడ్తాం॥

కంచు—చరణము మనసుచెడిన పలుకులిటులఁబలికెదేల గిడ్డూఖాన్

గిడ్డూ—నేనుఁగాన్, నేనుగాకి మెరీజాన్ బచావో ॥తేరె॥
మాదీపెండ్లాంకిమే మొట్టె మొగుడురాజా మామీదఖోపంమీ

కీమారా తేరాజా మాదీఘుండెల్లఖూకున్నాదీ । బుగుల్ బుగుల్ మంటాదీ । గుల్ ఖూబ్ సూరాతుండాదీ । మైనైహైతో సస్తాది సిన్నాది ॥ తేరెఖాలీ॥

---

2వ అంకము-2వ రంగము-37 వ పేజీ 17 వ పంక్తిలో
లేచుచు-పిదప

13 కమ-క్రూర—— డైలాగ్. పాట,

కమ——దూరంబుగనుండుమా। నీదుండగముఁ జాలింపుమా ॥దూ॥

అనుపల్లవి॥ కరమంటఁబోకు గదియఁగరాకు । సరసములాడఁజనదు నీకూ ॥దూ॥

చరణము॥ పరతరుణుల గవయుతలఁపు——భవమునకదిమూలమూ-

క్రూర——పరతరుణులఁగవయుట నా-పనియె సర్వకాలమూ-తరుణి నాపై నీకలుకా-

కమ——ఇటు తగదు నీవు నన్బలుకా-

క్రూర——విరసములాడబోకు నను కృపనరయుముమరుకేళిగూడుమా॥

కమ——దూరముగ నుండుమా॥

---

2వ అంకము-2వ రంగము-43 పేజీ-20 పంక్తిలో ఓకుష్టబుద్ధీ-పిదప

1ⁿ కమ-కన-తార,క్రూర-డైలాగ్ పాట.

కమ——అయ్యో యిదేమి ఘోరమూ యీ పసికూనలపై ॥అయ్యో॥

అనుపల్లవి॥ ఇయ్యెడ మాపై నీదు కృపఁజూపుమయ్య నాదు-కుయ్యాలాలించీ ॥అయ్యో॥

కన——చరణము-ఈదురాత్ము లిటుగానిసిడీ-తల్లీ..। ఈ॥ ముమ్ములనటు నిటుల లాగుచుఁ బ్రాణములదీయఁదలపడీ-రేట్లాలోర్తు॥

కమ——అయ్యో

తార—ఈసురాత్ము లిడు యిడుములనే-నెటుల- భరించెదనే జననీ మాదుజీవములఁ గొనంగదలచిరి-మాయమ్మా మముఁ గాపాడ రావే॥

కమ—అయ్యో,

క్రూ—ఈ మొండితనము నీ కేలా-నారీమణిరో ।యి॥ నామాట వినిన నీ కీ చేటు గలుగునె సఖి॥

కమ—ఆమాటలాడక మమ్ము నాదరించి కృపఁ జూడుమా-యింత క్రూరమా-నీకు న్యాయమ యిటు । లయ్యో యిదేమి।

---

2వ అంకము-2వ రంగము 44 పేజీ-21 పంక్తిలో-

(చూచి) పిదప.

15 జాలరులు— పాట

ఎంతబాగుండాది- యేంటాణగుండాది-యెంతసక్కంది రా పదుసూ॥ యెం॥ అనుపల్లవి. బంతిలాగుండాది బాబేసుగుండాది । పొంత కుండామూకుడంతోలె మొకము। చరణము। కుక్కతోక ల్లాగ మొగవిమ్మాసబొచ్చా-పక్క శాపల్లాగ కండ్లొప్పలిచ్చాముకు సూత్రెముద్దుమూటఁగట్టొచ్చాసుక్క-ల్లపొద్దా లేసూడా మనసొచ్చా॥ యెం॥ మసుకులోపొద్దాలెమును గేసినాదీ-ముసుగులోఁ దానే మొయినుకుంటాదీ-యిసుకేందియింటికీపట్టు కెల్దాము యింతగా నందరికి సూపిచ్చుదాము । యెంత బాగుండాది।

---

2వ అంకము-3వ రంగము-44వ పేజీ 25 పంక్తిలో-

జేయుచున్నావు-పిదప.

16 తార-కనక— పాట

హా మముంగాసినొందసేయ-గా నాకారణంబే మొదైవమా ।హా। అనుపల్లవి॥ మే మొకపసిబాలురమే గను-గొన - మేలునుగీడు నెరుంగ మేభువి ॥హా॥

చరణము - ఈమహాకానవమునఁ బడి తెరవు - నెఱుఁగక యెంతగాసి
నొందగా - మేమిటు లాకటిబాధచే గృశి. - యింపుచుండగఁ
జేసితేవిధి ॥హా॥

— —

2 వ అంకము 3 వ రంగము 47 వ పేజీ 25 వ పంక్తిలో
రింపగలరా పిదప

17 తారా, కనక— పాట

అయ్యా మీకృపచే మమువిడచిన- మేమటుమెలంగెదము నుమీ ॥అ॥
అనుపల్లవి, ఇయ్యెడలను మము, జంపిన మీకిపు డేమి శుభముచేకూ
రున్ ॥అయ్యా॥
చరణము॥ మాపయినిఁగల భూషణములఁగొని మమ్ము విడువుడో
యయ్యలారా, మమురక్షింపుఁడు సత్పుణ్యులారా (ఫైర్)
మీ యభీష్టంబెట్టులో యట్టులే వర్తించెదము.
మేమెవ్వారితో వచింపకుండెదము
దీనులమూ పసికూనలమయ్యా, దిక్కు లేనివారము, మానుఁడు మీ
యభిమతముల నిఁక ॥అయ్యా॥

— —

డిటో 50 వ పేజీ 7 పంక్తిలో కాళ్ళాడె పిదప

18 తార—

ఎందుఖోయీతివి తమ్ముకుర్రా ॥యెం॥ ఇందెందైనడాగి పరీక్షింతు
వా ॥యెం॥
చరణము॥ నామీఁద దయఁదప్పితో, ప్రాణము వీడెనని యెంచితో
యింకేమేమియు, తలంచితో స, న్నిటఁడించి పోఁజూచితో
యింకేమున్న దే మార్గమేమందురా ॥యెం॥ తప్పేమిచేసితిరా,
మా యప్ప నే నీ యెడలా, నిప్పుడీయడవిని, వీ డీవెప్పట్టున
కేగితో ! వో ! యప్పా నీమనంబెట్టులొప్పెరా ॥యెం॥

— —

3 వ అంకము 1వ రంగము 54 పేజి 11 వ పంక్తిలో
దుర్మార్గులున్నారు పిదప

19 విజ— పాట

ఎంత ఘోరములనొనర్చెన్, యెన్నియాపదలను గూర్చెన్ ॥అ॥ అంత కంతకు మోసములా నధికముగ నొనర్చె ఖలుడూ ॥యెం॥

చరణము॥ తనకు సోదరుడన్నిమెనఁ దలఁపక సతినినిఁ జంపెన్, జనని సమానయగు కమలఁజెనకఁ దలచె బాపుఁడూ, కనకసేన తారాసతి వనమునఁజంపఁగ బంపెన్, హీనుఁడు, కన్నుమిన్నెరుఁగని యజ్ఞానుఁడు, సతతమును దురభిమానుఁడు, భవముల కతఁడు ప్రధానుఁడు, కన్నుఁగానఁడు, ఆ క్రూర సేనుఁడు ॥యెం॥

——

3 వ అంకము 2 వ రంగము 57 వ పేజీ 5 వ పంక్తిలో
పట్టబోవును పిదప

20 మల్లిగాడు— పాట

సకటనిగుంటా, రాయె నాయెంటా, నరసఁ గూసుంటా, పెల్లిసేసుకుంటా ॥స॥

అనుపల్లవి గుర్రాన్నెక్కిత్తా కూడానోన్నొత్తా, సర్రాన వూరంత వూరేగివత్తా ॥స॥

చరణము. నేను కుశాల్ గుంటానిన్నంటా, నేనెపెల్లాడ్తానఁటాబల్ సోకు. జేసుకోమంటా నికసూడే మనవూరంటా, ననుకాగలిచ్చుకో నివంటా, యివకొట్టకు నాకేతంటా, నీ కాల్లకుబడి నే మొక్కుతావుంటా ॥స॥

శావలబుట్టా సంకనెట్టీ సందెడు పూసలు మెల్లోబెట్టీ; కోపుగకాశేర్రిడుసీరెను, గట్టీ, గోశేసిన రేక తొడగబెట్టి, మాపిటియల్లా నిన్నుసూత్తే, మాలచ్చోలిగ నుంటాయే ॥సకని॥

——

ివ అంకము-2వ రంగము-59వ పేజీ 23వ పంక్తి - అయినక్కలే పిదప

1 మల్లిగాడు. లచ్చి—డైలాగ్—పాట

మల్లిగాడు. అబ్బో నావల్లు మంటెత్తుతాదీ-దెబ్బమీద దెబ్బ నన్నుఁ
గొట్టకే ॥అ॥

అనుపల్లవి. కొట్టకే నన్నుఁదిట్టకే పోరెట్టకే - తాల్ తాల్ ॥అబ్బో॥

లచ్చి—పెద్దదయ్యమంటిదాన్ని - పెల్లిసేసుకుంటవా - వద్దనిచెప్పిన
నేన్ బతకలేనంటవా - వొల్లు గులగులంటవా- దెయ్యంబట్టిం
దంటవా - మొద్దుముండకొడుక పెల్లి వద్దనూ వద్దనూ,

మల్లిగాడు—ఇశ్శో నననననననననననన ॥అ॥

——

3వ అంకము - 3వ రంగము - 60 వ పేజీ 4వ పంక్తిలో
ప్రవేశము - పిదప.

2 కనక— పాట

ాడయేమీా తెలియదూగా ॥జా॥అ॥ అకటా నా పోదరీ ॥జా॥

చరణము. ఎందులాకు యేగితో - యెచటా మాయమయితో -ఆహా
యెటులతాళువాడనూ ॥జా॥

——

డిటో—62 వ పేజీ 11 వ పంక్తిలో - వగవకుము పిదప

3 ఋషులు— పాట

ర్ఘాయురస్తు ధా-త్రీపాలనప్రాప్తి ॥దీ॥ఆ॥ రస్తుశుభమస్తు సుయశోస్తు
బలమస్తు తే ॥దీ॥

చరణము. ధనకనకవస్తువాహాన సిద్ధిరస్తు న-జ్జనకృపాప్రాప్తిరస్తుసంతత
విజయోస్తు॥ దీర్ఘా॥

——

5వ అంకము - 3వ రంగము - 99వ పేజీ 24వ పంక్తి

రేమిటోయ్ - పిదప

24 గిడ్డూ— పాట

ఏమిా ఖులమ్మిాది - యేమిామతం ధూధు - హెంతఖరాబ్
డయ్యా॥రా॥అ॥ నామర్దాల్ - మిారంతాసూస్తేమాక
మాటల్కి-సేసెవ్ ఖబర్దార్ దూ త్తెరి ॥యే॥

చరణము- రాయరప్పల్ సెట్లురాగీభొమ్మల్ మిాకి- సెయ్యె
నిముఖ్తార్ - తొబతొబ-బూడ్దెంత మొఖంకి రాస్తా
ఫస్వాకి ఖల్లాకిపూస్తార్ ధూ తేరి ॥యే॥

మన్నిసస్తె ఖాకిమైలావడ్తార్ - అరె పస్వల్నస్తె భాగపట్టి
మన్సుల్ తఖ్వా మిాకి పస్వల్ యెఖ్వా ధూ ॥యే

---

5వ అంకము - 4 వ రంగము - 103 వ పేజీ 9 వ పం

కన— శా. పిదప

25 కనక—క్రూర—డైలాగ్—పాట

కనక—భండనంబున గండడననుచు - కండక్రొవ్వున మిడి
గుండెల్ దీతున్ ఖలా।

క్రూర—ఛీ పో

కన— భండ॥

క్రూర— పసితనమున నిటుపలికెదవా-మననమునకుఁ జన ద

కనక—ఆహా యింకెన్నోకదా?

క్రూర—ఛీ పో

కనక—భండనంబున.

క్రూర—సైన్యాధిపతిన్ - ధీమంతుని నీ - జనకునిఁబొరిఁ
వినవా కనుల - గనవాయటులె-విదళింతునునినుమన

కనక— చోరత్వముగాదూ-క్రూరత్వము ననదూ- వీరత్వ
జేరుతు యమపురికిన్॥

క్రూల—ఛీ.

కనక--భండనంబున.

# ...త్యనారాయణ బుక్ డిపోవారి స్టేజినాటకములు

| | | | |
|---|---|---|---|
| ...మరాజు రామానుజరావుగారివి— | | | |
| ...ర్జ రౌడి (పతిభక్తి) | రు | 1 | 4 |
| ...సన్యాబాయి | | 1 | 4 |
| ...ణికోట | | 1 | 8 |
| ...గావతరణము | | 1 | 4 |
| ...బ్రహ్మచారి | | 1 | 2 |
| ...తి అనసూయ | | 1 | 2 |
| ...లకేతనము | | 1 | 2 |
| ...హాభక్తవిజయము | | 1 | 2 |
| ...జకాళిదాసు | | 1 | 2 |
| చందాల కేశవదాసుగారివి— | | | |
| ...క్తార | రు | 1 | 4 |
| ...బంధనము | | 1 | 2 |
| ...చ్చాపురపు యజ్ఞనారాయణశాస్త్రివి | | | |
| ...పుత్రవిజయము | రు | 1 | 4 |
| ...ణా ప్రతాప్ సింగ్ | | 1 | 0 |
| శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారివి | | | |
| ...విత్రి | రు | 1 | 4 |
| శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారివి— | | | |
| ...బ్బిలియుద్ధము | రు | 1 | 2 |

| | | | |
|---|---|---|---|
| ముత్తనేని వేంకట చెన్నకేశవులుగారివి | | | |
| చండిక | రు | 1 | 2 |
| తులసీదేవి (సతీ తులసి) | | 1 | 2 |
| సూరి పార్థసారథిశర్మగారివి— | | | |
| రంగూన్ మెయిల్ | రు | 1 | 2 |
| కాళ్లకూరి హనుమంతరావుగారివి— | | | |
| కాలేజీ గరల్ | రు | 0 | 12 |
| లేడీడాక్టరు | | 0 | 12 |
| పిశుపాటి చిదంబరశాస్త్రిగారివి— | | | |
| శ్రీరామాంజనేయము అను హనుమద్రామసంగ్రామము | | 1 | 0 |
| వేదాంతకవిగారివి— | | | |
| తెలుంగుతల్లి | రు | 1 | 4 |
| చిలకమర్తి లక్ష్మీనరసింహముగారివి— | | | |
| చంద్రహాస | రు | 0 | 12 |
| ప్రసన్నయాదవము | | 0 | 12 |
| పారిజాతాపహరణము | | 0 | 12 |
| గయోపాఖ్యానం | | 1 | 0 |
| యర్రమిల్లి సూర్యప్రకాశరావుగారివి— | | | |
| మోడరన్ బి. ఏ. | రు | 1 | 0 |

శ్రీ మా నా పు రం అ ప్పా రా వు గా రి

## క్రొత్తనవలలు.

| | | | |
|---|---|---|---|
| ...రుగుపిల్ల | రు | 0 | 4 |
| ...నీ అరిష్టు 1 వ భా॥ | | 0 | 4 |
| ...స్ పాట్ 2 వ భా॥ | | 0 | 4 |
| ...ప్ మేరేజ్ | | 0 | 4 |
| ...నుభద్ర | | 0 | 4 |
| ...దిగపడుచు | | 0 | 4 |

| | | | |
|---|---|---|---|
| క్రిష్టియన్ డాక్ట్రిస్ | రు | 0 | 4 |
| నైట్ షికార్ | | 0 | 4 |
| టిపికల్ జోడా | | 0 | 4 |
| హోమ్ డాక్ట్రిస్ | | 0 | 4 |
| రాలుగాయి | | 0 | 4 |
| రాణీవాసం | | 0 | 4 |

...లయువారు :

# కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు.

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో.

రా జ మం డ్రి.

కోపల్లి వేంకటరమణారావుగారి

సాంఘిక స్టేజినాటకములు.

| | | | |
|---|---|---|---|
| ఓన్లీడాటరు | 1 | 0 | 0 |
| భాగ్యరేఖ | 1 | 0 | 0 |
| క్లాసుమేట్సు | 1 | 0 | 0 |
| గరల్ వైఫ్ | 1 | 0 | 0 |
| పెట్టుమారిమగడు | 1 | 0 | 0 |
| బలేపెండ్లిండ్లు | 1 | 0 | 0 |

కొప్పరపు సుబ్బారావుగారి

| | | | |
|---|---|---|---|
| రోషనార | 1 | 0 | 0 |
| తులసీదేవి ము. వెం. చెన్నకేశవులు | 1 | 4 | 0 |
| కనక్తార చం. కేశవదాసుగారు | 1 | 4 | 0 |

గు. అప్పారావుపంతులుగారి

| | | | |
|---|---|---|---|
| కన్యాశుల్కము | 1 | 8 | 0 |

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు,

బుక్సెల్లర్సు, రాజమండ్రి.